# ప్రపంచ కమ్యూనిస్టు, కార్మిక పార్టీల ప్రతినిధుల సమావేశ ప్రకటన



విశాలాంధ్ర ప్రచురణాలయము
విజయవాడ-2

నేటి అంతర్జాతీయ పరిస్థితినిగూర్చి, శాంతి, జాతీయ స్వాతంత్ర్యం, ప్రజాతంత్రం, సోషలిజముల కొరకై ముందుజరగవలసిన పోరాటములగూర్చివున్న అత్యవసర సమస్యపై కమ్యూనిస్టు, కార్మిక పార్టీల ప్రతినిధులు ఈ సమావేశంలో చర్చించారు.

చర్చించిన విషయాలపై సమావేశంలో పాల్గొన్న ప్రతినిధుల అభిప్రాయాలలో ఐక్యతవున్నట్లు ఈ సమావేశం చూపించింది. 1957 లో అంగీకరింపబడిన ప్రకటనకూ, శాంతి మానిఫెస్టోకూ, తాము కట్టుబడి వున్నట్లు కమ్యూనిస్టు, కార్మిక పార్టీలు ఏకగ్రీవంగా మరొకసారి ధృవపర్చాయి. సృజనాత్మక మార్క్సిజం – లెనినిజముల ఫలితమైన ఈ ప్రోగ్రాము డాక్యుమెంట్లు మన కాలంలో ఏర్పడిన మిక్కిలి ముఖ్యమైన సమస్యలపై అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమం యొక్క మూల అవగాహనలేమిటో నిర్ణయించినవి; సార్వజనీన లక్ష్యాలకు చేరటానికై జరిగే పోరాటంలో కమ్యూనిస్టు, కార్మికపార్టీలు తమ ప్రయత్నాలను ఏకీకృతం చేయటానికి పెద్దఎత్తున తోడ్పడినవి. మొత్తం అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమానికి పతాకాలుగానూ, కార్యక్రమదర్శకులుగానూ ఇవి నిల్చివుంటాయి.

ఈ ప్రకటనలోనూ, శాంతి మానిఫెస్టోలోనూ అంతర్జాతీయ పరిస్థితినిగూర్చి చేసిన అనుశీలనా, ప్రపంచపరిస్థితుల అభివృద్ధిని గూర్చి ఇచ్చిన దృక్పథమూ సరైనవనీ, సృజనాత్మక మార్క్సిజము–లెనినిజము మహత్తర శాస్త్రవిజ్ఞానబలమునూ, శక్తివంతమైన పాత్రనూ కల్గినదనీ గత మూడు సంవత్సరాలలోనూ జరిగిన పరిణామాలు నిరూపిస్తున్నవి.

ప్రపంచ కమ్యూనిస్టు విధానంయొక్క బలమూ, అంతర్జాతీయ పలుకుబడీ త్వరితగతిని వృద్ధికావటమూ, జాతీయ విముక్తి వుద్యమం తాకిడికి వలసవిధానం అతివేగంగా విచ్ఛిన్నమయ్యే పరిణామమూ, పెట్టుబడిదారీ ప్రపంచంలో వర్గపోరాటాలు తీవ్రం కావటమూ ప్రపంచ పెట్టుబడిదారీ విధానం అవిరామంగా క్షీణించటం, కుళ్ళిపోవటమూ – ఇవీ ఈ మూడు సంవత్సరాల ముఖ్య ఫలితం. అంతర్జాతీయ రంగంలో పెట్టుబడిదారీ శక్తులపై సోషలిస్టుశక్తుల ఆధిక్యత, యుద్ధశక్తులపై శాంతి శక్తుల ఆధిక్యత ఎన్నడూలేనంత స్పష్టంగా కన్పడుతోంది.

అయినప్పటికీ, తన స్థానాలను నిలబెట్టుకోవాలనే వుద్దేశంతో, సామ్రాజ్యవాదం నిరాయుధీకరణను విచ్ఛిన్నం చేస్తూంది, ప్రచ్ఛన్న యుద్ధాన్ని కొనసాగిస్తూ, దానిని కడవరకూ తీసుకువెళ్ళి ప్రకోపింప చేయజూస్తూంది; నూతన ప్రపంచయుద్ధానికి సన్నాహాలు చేయటంలో పట్టుదలగా వ్యవహరిస్తూంది. ఈ పరిస్థితిమూలకంగా, యుద్ధాన్ని నివారించి, ప్రజలకు శాంతిమయజీవితాన్ని రూఢిపర్చటానికిగాను సోషలిస్టుదేశాలు, అంతర్జాతీయ కార్మికవర్గమూ, సామ్రాజ్యవాదవ్యతిరేక జాతీయ వుద్యమమూ, అన్ని శాంతికాముక దేశాలూ, శాంతి కాముకవాదులందరూ మరింత ఘనిష్టమైన సంయుక్త ప్రయత్నాలమూ,– దీక్షతోకూడిన కార్యాచరణనూ చేబట్టవలసి వుంటుంది; సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాలలోనూ, జాతీయ స్వాతంత్ర్యం కొరకూ, సోషలిజంకొరకూ జరిగే పోరాటంలోనూ అన్ని విప్లవ శక్తులూ మరింతఎక్కువ దృఢంగా సన్నిహితం కావలసివుంటుంది.

# 1

# ఈ యుగంలోని ప్రధాన సారాంశం

,పెట్టుబడిదారీ విధానంనుండి సోషలిజానికి పరివర్తనం చెందడం మనకాలం యొక్క ప్రధాన హంశం. ఇది మహత్తరమైన అక్టోబరు సోషలిస్టు విప్లవంతో ప్రారంభమైనది. ఇది రెండు ప్రతిపక్ష సామాజిక వ్యవస్థలమధ్య పోరాటం జరిగేకాలం; సోషలిస్టు విప్లవాల జాతీయ విముక్తి విప్లవాలకాలం; సామ్రాజ్యవాదం విచ్ఛిన్న మయ్యేకాలం; వలసవిధానం రద్దుఅయ్యేకాలం; మరిన్ని ఎక్కువ జాతులు సోషలిస్టు పంథాకు పరివర్తనం చెందేకాలం; ప్రపంచ స్థాయిలో సోషలిజమూ, కమ్యూనిజమూ విజయం పొందేకాలం.

**సమాజాభివృద్ధిలో ప్రపంచ సోషలిస్టువ్యవస్థ నిర్ణయాత్మక శక్తిగా తయారవుతూ వుండటం మన కాలంయొక్క ప్రధాన లక్షణం.**

ఇటీవల కాలంలో కొత్త పాత ప్రపంచాల మధ్య జరిగిన బ్రహ్మాండమైన పోరాటాలలో సోషలిజం యొక్క బలమూ, అజే యతా స్పష్టమైనవి. ఆయుధబలంద్వారా చరిత్రపురోగతిని అడ్డ గించాలని సామ్రాజ్యవాదులు, వారి దుందుడుకు బలగమైన ఫాసీ జమూ చేసిన ప్రయత్నాలు విఫలమైనవి. సామ్రాజ్యవాదం ఐరోపా లోనూ, ఆసియాలోనూ సోషలిస్టువిప్లవాలను అడ్డగించలేక పోయిందని రుజువైనది. సోషలిజము ప్రపంచవ్యవస్థ అయింది. సోషలిస్టుదేశాల ఆర్థికపురోగమనాన్ని అడ్డగించ సామ్రాజ్య వాదులు ప్రయత్నించారు; కాని వీరితంత్రాలు భగ్నంచేయబడినవి. వలస బానిసత్వపువ్యవస్థను నిలబెట్టి వుంచటానికి సామ్రాజ్యవాదులు తమశక్తికొలదీ ప్రయత్నించారు. కాని ఈ వ్యవస్థ బద్దలైపోతున్నది. ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ మరింత బలపడుతూ వున్న కొలదీ అంతరా

తీయపరిస్థితి స్వాతంత్ర్యము, ప్రజాతంత్రము, సమాజాభ్యుదయముల కొరకు పోరాడే ప్రజలకు అనుకూలంగా మరింతగా మారుతుంది.

**ఈనాడు ప్రపంచసోషలిస్టు వ్యవస్థా, సమాజాన్ని సోషలిజానికి పరివర్తనం చెందించటానికి గాను సామ్రాజ్యవాదానికివ్యతిరేకంగా పోరాడుచున్న శక్తులూ, ఇవే సమాజ చారిత్రికాభివృద్ధియొక్క ప్రధానవస్తువునూ, ప్రధాన ధోరణినీ, ప్రధానలక్షణాలనూ నిర్ణయించేవిగావున్నవి. సామ్రాజ్యవాదం ఏ ప్రయత్నాలనుజేసినా చరిత్రపురోగతిని అది ఆపలేదు సోషలిజం ఇంకాసాధించే నిర్ణయాత్మక విజయాలకు నమ్మకమైనపునాది ఏర్పర్చబడింది. సోషలిజంయొక్క సంపూర్ణవిజయం తథ్యం.**

సోషలిజం విజయంపొందిన దేశాలు ముఖ్యంగా తమ ఆర్థిక నిర్మాణంద్వారానే ప్రపంచవిప్లవంయొక్క అభివృద్ధిపై ప్రభావాన్ని పడవేస్తాయని లెనిన్ చెప్పిన విషయం సరైనదని సమాజాభివృద్ధి గలిరుజువుచేస్తోంది. సోషలిజము ఉత్పత్తిలోనూ, శాస్త్రవిజ్ఞానములోను, టెక్నాలజీలోనూ, ప్రజలభౌతిక, ఆధ్యాత్మికవాంఛలుమరింతఎక్కువగా సఫలమయ్యే ఒక నూతన స్వేచ్ఛాపూరిత సమాజాన్ని ఏర్పరచటంలోనూ, అప్రతిమానమైన నిర్మాణాత్మకాభివృద్ధిని సాధించింది. ప్రపంచోత్పత్తిలో పెట్టుబడిదారీవ్యవస్థయొక్క భాగంకంటె సోషలిస్టు వ్యవస్థయొక్క భాగం ఎక్కువయేకాలం ఎంతోదూరం లేదు. మానవకృషిలోని నిర్ణయాత్మకరంగమైన భౌతిక వస్తూత్పత్తి రంగంలో పెట్టుబడిదారీ విధానం ఓడించబడుతుంది.

సోషలిస్టు వ్యవస్థ స్థిరపడి, అభివృద్ధికావడం ద్వారా పెట్టుబడిదారీ దేశాలలోని ప్రజల పోరాటంపై అంతకంతకూ ఎక్కువైన ప్రభావాన్ని ప్రసరింపజేస్తుంది. తన ఉదాహరణ మూలకంగానే ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ పెట్టుబడిదారీ దేశాలలోని శ్రామిక ప్రజాసామాన్యంయొక్క ఆలోచనాపద్ధతిని విప్లవాత్మకం జేస్తున్నది. పెట్టుబడిదారీ విధానానికివ్యతిరేకంగా పోరాడ వారిని ప్రేరేపించుచున్నది; ఆ పోరాటాన్ని మిక్కిలి సుగమం చేస్తున్నది. పెట్టుబడిదారీదేశాలలో శాంతి, జాతీయస్వాతంత్రములకొరకూ,

ప్రజాతంత్రం విజయముకొరకూ, సోషలిజం విజయంకొరకూ పోరాడేశక్తులు సంఖ్యలోనూ, బలంలోనూ వృద్ధిపొందుచున్నవి.

ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థతీవ్రమైన విచ్ఛిన్నదశలో, శిథిలదశలో పడివున్నది. గుత్త పెట్టుబడిదారీ విధానం ప్రభుత్వ గుత్త పెట్టుబడిదారీ విధానంగా మారే పరిణామాన్ని దానిలోని వైరుధ్యాలు త్వరితం చేశాయి

జాతి జీవనంపై గుత్తసంస్థల పిడికిలిని మరింత బిగించటం ద్వారా పెట్టుబడిదారీవిధానాన్ని రక్షించే ఆశయంతోనూ, కార్మిక వర్గాన్ని కొనప్రాణంవరకూదోచుకొనటం, జనాభాలో పెద్దభాగాల్ని కొల్లగొట్టుటములద్వారా సామ్రాజ్యవాద బూర్జువావర్గంయొక్క లాభాలను పెంచాలనే ఉద్దేశంతోనూ ప్రభుత్వ గుత్తపెట్టుబడిదారీవిధానం. గుత్త సంస్థలయొక్క శక్తిని ప్రభుత్వ శక్తితో సన్నిహితంగా పెనవేస్తుంది.

కాని, ఏపద్ధతులను, అది చేపట్టినా గుత్త బూర్జువావర్గం పెట్టుబడిదారీవిధానాన్ని రక్షించలేదు. కొలది సంఖ్యలోవున్న గుత్తసంస్థల ప్రయోజనాలకూ, మొత్తం జాతియొక్క ప్రయోజనాలకూ తీరని వైరుధ్యాలున్నవి. పెట్టుబడిదారీ సమాజంలోని వర్గవైషమ్యాలూ, జాతీయవైషమ్యాలూ, అంతరంగిక, బాహ్యావైరుధ్యాలూ తీవ్రతరమైనవి. పెట్టుబడిదారీవిధానంయొక్క శిథిలమయ్యే స్తంభాలను సైనికతత్వంద్వారా నిలబెట్టాలని చేసే ప్రయత్నాల మూలకంగా ఈ వైరుధ్యాలు మరింత తీవ్రమౌతున్నవి.

పెట్టుబడిదారీ దేశాలలో ఉత్పత్తిశక్తులకూ, ఉత్పత్తిసంబంధాలకూవున్న సంఘర్షణ ఈనాడున్నంత తీవ్రంగా ఎన్నడూలేదు. ఆధునిక శాస్త్రవిజ్ఞానమూ, టెక్నాలజీ సాధించిన విజయాలను సమాజ పురోగమన ప్రయోజనాలకు వుపయోగించటానికి వీలులేకుండా పెట్టుబడిదారీ విధానం అంతకంతకూ ఎక్కువగా అడ్డుపడుచున్నది. మానవప్రతిభ కనిపెట్టిన నూతనవిషయాలను, వినాశనకర యుద్ధానికి ఉపయోగపడే బలీయమైన సాధనాలుగా మార్చటంద్వారా మానవాళికి వ్యతిరేకంగా వీటిని తయారుచేస్తున్నది.

పెట్టుబడిదారీ ఆర్థికవిధానంయొక్క అస్థిరత్వం పెరుగుతోంది. కొన్ని పెట్టుబడిదారీ దేశాలలో ఉత్పత్తి ఎంతోకొంత మేరకు పెరుగుతూవున్నా, జాతీయ అంతర్జాతీయస్థాయిలలో పెట్టుబడిదారీ విధానంలోని వైరుధ్యాలు మరింతతీవ్రమౌచున్నవి. ఇటీవలి ఆర్థికసంక్షోభ ఫలితాలతో ఇంకాపెనగులాడుతూవున్న సమయంలోనే,కొన్ని పెట్టుబడిదారీ దేశాలు కొత్త ఆర్థిక ఒడుదుడుకులను ఎదుర్కొనవలసి వస్తున్నది. పెట్టుబడిదారీ వుత్పత్తివిధానంలోని అరాజక స్వభావం మరింత ప్రస్ఫుటమవుతున్నది. పెట్టుబడి కేంద్రీకరణ అపూర్వపరిమాణాన్ని జేరుతోంది; గుత్తలాభాలూ, అత్యధికలాభాలూ పెరుగుచున్నవి. కొత్తరీతులలో, మరీ ముఖ్యంగా శ్రమభారం ద్వారా, గుత్తపెట్టుబడి కార్మికవర్గాన్ని దోచుకోవటాన్ని మిక్కిలి తీవ్రతరం చేసింది. పెట్టుబడిదారీ విధానం క్రింద స్వయంచోదిత యంత్రస్థాపన, "రేషనలైజేషన్" ప్రవేశపెట్టటం శ్రామికప్రజలకు మరింత ఎక్కువ దుస్థితినే తెచ్చిపెట్టుతాయి. గట్టి పోరాటాలద్వారా మాత్రమే కార్మికవర్గం కొన్నిదేశాలలో తన తక్షణ కోర్కెలలో కొన్నిటిని సంపాదించుకొనగల్గింది. అయినప్పటికీ, చాలా పెట్టుబడిదారీదేశాలలో ప్రజల జీవన ప్రమాణం యుద్ధానికి పూర్వమున్న జీవన ప్రమాణంకంటె ఇంకా తగ్గియే వున్నది. బూర్జువా వర్గం వాగ్దానాలు చేసినప్పటికీ, తద్విరుద్ధంగా కొన్ని పెట్టుబడిదారీ దేశాలలో, మాత్రమే, అదైనా తాత్కాలికంగా మాత్రమే, అందరికి పని కల్పించబడినది. గుత్త సంస్థల ప్రాబల్యం మూలకంగా రైతాంగ బహుజనబాహుళ్యంయొక్క, చిన్న, మధ్యతరగతి బూర్జువా వర్గంలోని విస్తారమైన సెక్షన్ల యొక్క ప్రయోజనాలకు మరింత హెచ్చు హాని జరుగుతూ వున్నది. పెట్టుబడిదారీదేశాలలో—బాగా అభివృద్ధి పొందిన వాటిలోకూడా—ఆర్థికంగా వెనుకబడిన ప్రాంతాలు ఇంకా వున్నవి; ఆ ప్రాంతాలలో ప్రజల బీదరికం హృదయవిదారకంగా వున్నది; అంతేకాదు, ఇంకా విస్తృతమౌతూవున్నది.

ఆధునిక పెట్టుబడిదారీవిధానం ప్రజా పెట్టుబడిదారీ విధానంగా మారిందనీ, ఉత్పత్తిలోని అరాజకాన్ని, ఆర్థిక సంక్షోభాలనూ, అధిగ

మించి, మొత్తం శ్రామిక ప్రజల సుఖజీవనాన్ని రూఢిచేయగల "శ్రేయోరాజ్యాన్ని" ఏర్పర్చిందనీ బూర్జువా తత్వవేత్తలూ, మార్క్సిజం వక్రభాష్యకారులూ చెప్పేవన్నీ పచ్చిఅబద్ధాలని ఈపై వాస్తవ విషయాలు మరొక పర్యాయం రుజువు చేస్తున్నవి.

పెట్టుబడిదారీవిధానం అభివృద్ధిలోని అసమానగతి ఫలితంగా సామ్రాజ్యవాద దేశాల బలాబలాలమధ్య నిర్విరామంగా మార్పులు వస్తున్నవి. సామ్రాజ్యవాద పెత్తనంక్రిందవుండే పరిధి తగ్గినకొలదీ సామ్రాజ్యవాద రాజ్యాలమధ్య వైషమ్యాలు బలపడుతూవున్నవి. "సంయోగం" అనే నినాదంక్రింద కొత్తగా ఏర్పడిన వివిధదేశాల ఉమ్మడి సంస్థలు వాస్తవంలో సామ్రాజ్యవాదదేశాలమధ్య వైషమ్యాలూ, పోరాటమూ మరింత హెచ్చుటానికే దారితీసినవి. ప్రపంచ పెట్టుబడిదారీమార్కెట్టును మిక్కిలి పెద్దపెట్టుబడిదారీ ఉమ్మడిసంస్థలమధ్య పంచుకొనటానికీ, బలీయమైన సామ్రాజ్యవాద రాజ్యాలు తమకన్న బలహీనమైన వాటాదార్ల ఆర్థికరంగాలలో చొచ్చుకుపోవటానికి ఇవి కొత్తరూపాలు మాత్రమే.

నేటి ప్రధాన సామ్రాజ్యవాద దేశమైన అమెరికా సంయుక్త రాష్ట్రంలోనే పెట్టుబడిదారీవిధానం యొక్క క్షీణత మరీ ప్రస్ఫుటంగా కన్పడుతుంది. తన స్వాధీనంలో వున్న ఉత్పత్తిశక్తుల నన్నిటినీ అమెరికాసంయుక్తరాష్ట్రాలు వుపయోగించుకొనటంలో అసమర్థమౌతున్నదన్నది స్పష్టం. ప్రపంచంలో బాగా అభివృద్ధి పొందిన పెట్టుబడిదారీ దేశాలలో కెల్లా భాగ్యవంతమైన అమెరికా సంయుక్తరాష్ట్రాలు ముఖ్యంగా దీర్ఘకాలిక తీవ్ర నిరుద్యోగానికి ఆటపట్టుగా వున్నది. పరిశ్రమలు తమ శక్తికి తగ్గి పనిచేయటమనేది అంతకంతకూ ఎక్కువౌతూ, ఆ దేశంలో శాశ్వతమైనది. శ్రామిక ప్రజల జీవన ప్రమాణాన్ని దెబ్బకొట్టి తద్వారా సైనిక ఖర్చులను విపరీతంగా పెంచినప్పటికీ, యుద్ధానంతర కాలంలో ఉత్పత్తి పెరుగుదలరేటు పడిపోతూ వున్నది; జనాభా పెరుగుదలను అంటిపెట్టుకొని దానికికొద్దిగా పైగామాత్రం వున్నది. అధికోత్పత్తి సంక్షోభాలు మరింత తరచుగా వస్తున్నవి.మిక్కిలి అభివృద్ధి

చెందిన పెట్టుబడిదారీ దేశం యొక్క ఆర్థికవ్యవస్థయే మిక్కిలి వికృతమైన, సైనికతత్వభూయిష్టమైన ఆర్థిక వ్యవస్థగా మారింది. ఏ యితర పెట్టుబడిదారీ దేశంకంటెకూడా అమెరికా సంయుక్తరాష్ట్రాలే ఆసియాఖండంలోని,మరీముఖ్యంగా లాటిన్ అమెరికాలోని సంపదలను దోచుకొంటూ. ఆ దేశాల పురోగమనాన్ని అరికట్టుచూ వున్నది. ఆఫ్రికాలో అమెరికా సంయుక్తరాష్ట్రాల పెట్టుబడిదారీ ప్రవేశం అధికమౌతోంది. **అన్నిటిలోకీ పెద్ద అంతర్జాతీయ దోపిడిదారుగా అమెరికా సంయుక్తరాష్ట్రాల సామ్రాజ్యవాదం తయారైనది.**

ప్రధానంగా సైనిక కూటములను ఏర్పరచే పాలసీద్వారానూ, ఆర్థిక 'సహాయాన్ని' అందజేసే పాలసీద్వారానూ అనేక దేశాలను తన పెత్తనంక్రిందకు తెచ్చుకొంటానికి అమెరికా సంయుక్త రాష్ట్రాల సామ్రాజ్యవాదులు చూస్తున్నారు. అభివృద్ధిపొందిన పెట్టుబడిదారీ దేశాల సార్వభౌమత్వాన్నికూడా వారు భంగపరుస్తున్నారు. అమెరికా సంయుక్త రాష్ట్రాల సహాయంతో విప్లవ విముక్తి శక్తులను అణచివేస్తానికీ, శ్రామికప్రజలకు ప్రజాతంత్ర హక్కులు లేకుండా చేస్తానికీ, సామాజికాభివృద్ధికై ప్రజలు జరిపేపోరాటాన్ని అడ్డగిస్తానికి అభివృద్ధిపొందిన పెట్టుబడిదారీ దేశాలలోని పెత్తందారీ గుత్తబూర్జువావర్గం తమ దేశాల సార్వభౌమత్వాన్ని కూడా ధారపోస్తున్నారు. ఆయుధోత్పత్తి పోటీలోనూ, కొత్త దురాక్రమణ యుద్ధానికి తయారుచేసే ఫన్నాహాలలోనూ, సోషలిస్టుదేశాలకూ, తటస్థదేశాలకూ వ్యతిరేకంగా రహస్య కుట్ర కార్యకలాపాలను సాగించడంలోనూ అమెరికన్ సామ్రాజ్యవాదం ఈ దేశాలను ఇరికిస్తున్నది.

పెట్టుబడిదారీ విధానం యొక్క మూలస్తంభాలు ఎంతగా చివికి శిథిలమైపోయినవంటే అనేక దేశాలలోని పాలక సామ్రాజ్యవాద బూర్జువావర్గం, తన స్వంతబలంతోనే, విస్తరణలోనూ, బలంలోనూ నానాటికీ పెరుగుతూవున్న ప్రజాతంత్ర శక్తులనూ పురోగామి శక్తులనూ ఇకెంత మాత్రమూ ఎదుర్కోలేక పోతున్నది. సోషలిస్టు శిబిరాన్ని అందరూకలిసి ఎదుర్కొంటానికీ, జాతీయ విముక్తి [illegible]ల్లనూ, కార్మికోద్యమాన్ని, సోషలిస్టు ఉద్యమాన్ని గొంతు

నులిమి నాశనం చేస్తానికి అమెరికా సంయుక్త రాష్ట్రాల నాయకత్వాన సామ్రాజ్యవాదులు సైనిక – రాజకీయ కూటములను ఏర్పరుస్తున్నారు. అమెరికా సంయుక్త రాష్ట్రాల సామ్రాజ్యవాదం ప్రపంచ అభివృద్ధినిరోధక శక్తియొక్క ప్రధానమైన ఊత అనీ, అంతర్జాతీయ పోలీసుదళమనీ, మొత్తం ప్రపంచమందలి ప్రజల శత్రువుగా అయిందనీ ఇటీవల కాలంలో జరిగిన అంతర్జాతీయ పరిణామాలు అనేక రుజువుల ద్వారా తెలియజేసినవి.

అమెరికా సంయుక్తరాష్ట్రాలు ఏర్పరచినసైనికకూటముల వ్యవస్థ బలహీనపడుతూన్నది. అందుకు ఆ కూటములలోని సభ్యుల మధ్యనే జరుగుతూవున్న పోరాటమూ ఈ కూటములను రద్దుచేయాలని ప్రజలు సాగించే పోరాటమూ కారణం. దురాక్రమణతత్వపు కూటములను బలపర్చాలని ఒకమూల అమెరికా ప్రయత్నిస్తూవుంటే మరొక మూల ప్రజల ప్రతిఘటన మరింత పెరుగుతోంది. పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థలో అమెరికా సంయుక్తరాష్ట్రాలభాగం తగ్గుతూవున్నప్పటికీ, ఆధునిక సామ్రాజ్యవాదంయొక్క ప్రధాన ఆర్థిక, ధన, సైనికశక్తిగాఇంకా అదే వుంటున్నది. తమస్థానాలను నిలబెట్టుకోవాలని బ్రిటిషు, ఫ్రెంచి సామ్రాజ్యవాదులు మొండిప్రయత్నాలను చేసుకొంటున్నారు. అమెరికన్ గుత్తసంస్థలతో దగ్గరగా ముడిపడివున్న పశ్చిమజర్మనీ, జపాను గుత్తసంస్థలు తమ శక్తిని పుంజుకొని, తమ విస్తరణను అధికం జేస్తున్నాయి. సామ్రాజ్యవాద పంథాను అనుసరించుతూ–పశ్చిమజర్మను గుత్తసంస్థలు అంతకంతకూ ఎక్కువగా తక్కువ అభివృద్ధిజెందిన దేశాలను దోచుకోజూస్తున్నాయి.

సామ్రాజ్యవాదంతో పోరాడటానికి ప్రజలు మరింత దృఢమైన దీక్షతో లేస్తున్నారు. శ్రామికశక్తికీ, పెట్టుబడికీ మధ్య, ప్రజాతంత్రానికీ, అభివృద్ధినిరోధకశక్తికీ మధ్య, స్వాతంత్ర్యమునకూ, వలసదేశాంగనీతికీ మధ్య నేడు గొప్పపోరాటం సాగుతూవున్నది. క్యూబాలో ప్రజావిప్లవంపొందిన విజయం లాటిన్ అమెరికా ప్రజలకు అద్భుతమైన ఉదాహరణగా కనపడుతోంది. ఆఫ్రికాలో స్వేచ్ఛ, జాతీయ స్వాతంత్ర్యములకొరకు జరిగే వలస వ్యతిరేకపుద్యమం అప్రతి

హతంగా విస్తరించుతోంది. ఇరాక్‌లో సాగిన సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయ తిరుగుబాటు విజయం పొందింది. జపానులో, జపాను అమెరికా సైనిక ఒడంబడికకు వ్యతిరేకంగానూ, శాంతి, ప్రజాతంత్రం, జాతీయ స్వాతంత్ర్యముల కొరకూ బలీయమైన ప్రజా వుద్యమం సాగుతూ వున్నది. ప్రజాతంత్ర రక్షణకొరకై ఇటలీలో ప్రజా సామాన్యం శక్తివంతమైనచర్యలు తీసుకొంటున్నది. అవి ఆదేశంలోని శ్రామికప్రజల మిలిటెంటు నిశ్చయాన్ని తెలియచేస్తున్నవి. ఫ్రాంసులో ప్రజాతంత్రం కొరకూ, వ్యక్తిగత అధికారపు అభివృద్ధి నిరోధక పరిపాలనకూ వ్యతిరేకంగా జరిగే పోరాటం చురుకు అవుతూవున్నది. అమెరికా సంయుక్త రాష్ట్రాలు, అర్జంటీనా, ఉరుగ్వే, చిలి, ఇండియా, బ్రిటను, కెనడా, బెల్జియం, ఇతర పెట్టుబడిదారీ దేశాలలోనూ పెద్ద కార్మిక సమ్మెలు జరిగినవి. తమ ప్రాథమిక హక్కుల కొరకై అమెరికన్ నీగ్రోలు జరిపే చర్యలు ప్రజాబాహుళ్యపు స్వభావాన్ని తీసుకొంటు న్నవి. స్పెయిన్, పోర్చుగలులలో వున్న ఫాసిస్టు నియంతృత్వాలకు వ్యతిరేకంగా జాతీయ శక్తులనన్నిటినీ ఐక్యంజేయాలనే వాంఛ నానాటికీ పెరుగుతోంది. గ్రీసులో ప్రజాతంత్రవుద్యమం బలపడుతూ వున్నది. కొలంబియా, వెనిజులాలలో దౌర్జన్యపూరిత సైనికపరి పాలనలు కూలద్రోయబడినవి; దక్షిణ కొరియా, టర్కీలలో వుండే పచ్చి అమెరికన్ అనుకూల కీలుబొమ్మ ప్రభుత్వాలపై దెబ్బ తీయడం జరిగింది. దక్షిణవియత్నాం, లావోస్‌లలో అమెరికన్ సామ్రాజ్యవాదులకూ, వారిగులాములకూ వ్యతిరేకంగా జాతీయ ప్రజాస్వామికవుద్యమం అభివృద్ధి అవుతూవున్నది. ఇండోనేషి యాలో సామ్రాజ్యవాదులు నిలుపుకున్న ఆర్థికస్థానాలను, ముఖ్యంగా డచ్చి వలసరాజ్యాధిపతులు పట్టుకుకూర్చొన్న స్థానాలను ఆదేశప్రజలు తుడిచిపెడుతున్నారు. శాంతి రక్షణకై ప్రజావుద్యమం అన్నిఖండాలలోనూ పెరుగుతూవున్నది. ఇదంతాకూడా, సామ్రాజ్య వాదవ్యతిరేక, జాతీయస్వాతంత్ర్య, యుద్ధవ్యతిరేక వుద్యమ తరంగం, వర్గపోరాటాల వుద్యమతరంగం అంతకంతకూ పెరుగుతూవున్న దానికి గట్టి నిదర్శనం.

పెట్టుబడిదారీ విధానంలోని సర్వసామాన్య సంక్షోభంలో ఒక నూతన దశ ప్రారంభమైనది. ఆసియా, ఐరోపాఖండాలలోని అనేక దేశాలలో—మానవాళిలో మూడవ భాగంగల దేశాలలో — సోషలిజం విజయంపొందడం, మొత్తం ప్రపంచం అంతటా సోషలిజంకొరకై పోరాడే శక్తులు బలీయంగా అభివృద్ధికావడం, సోషలిజంతో జరిగే పోటీలో సామ్రాజ్యవాదులయొక్క స్థానాలు క్రమేణా బలహీనపడుతూ వుండడం; జాతీయవిముక్తి పోరాటంలో బ్రహ్మాండమైన నూతన వెల్లువ రావటం, వలస దేశాంగ వ్యవస్థ అంతకంతకూ హెచ్చుగా విచ్ఛిన్నమైపోతూ వుండడం; పెట్టుబడిదారీ విధానంయొక్క మొత్తం ప్రపంచ ఆర్థికవ్యవస్థ అంతకంతకూ హెచ్చుగా అస్థిరమౌతూ వుండడం; ప్రభుత్వ గుత్త పెట్టుబడిదారీ విధానము, సైనిక తత్వముల అభివృద్ధి మూలకంగా పెట్టుబడిదారీ విధానంలోని వైరుధ్యాలు తీక్ష్ణంకావడం; గుత్తసంస్థలకూ, మొత్తం జాతియొక్క ప్రయోజనాలకూ మధ్య వైరుధ్యాలు పెరగడం; బూర్జువాప్రజాతంత్రాన్ని కుంచింపజేయటమూ, ప్రభుత్వాన్ని నియంతృత్వ పద్ధతులలోనూ, ఫాసిస్టు పద్ధతులలోనూ నడపజూచే ధోరణి ఏర్పడటమూ; బూర్జువా రాజకీయాలలోనూ, తాత్వికపద్ధతిలోనూ, గాఢమైన సంక్షోభం రావటములో ఈ నూతనదశ కన్పడుతుంది. ప్రపంచయుద్ధం ఫలితంగాగాక, రెండు వ్యవస్థలమధ్యపోటీ పోరాటముల పరిస్థితులలోనూ, శక్తులబలాబలాలలో సోషలిజంవైపు అంతకంతకూ ఎక్కువఅనుకూలంగా మార్పు వచ్చేపరిస్థితులలోనూ, సామ్రాజ్యవాదంలోనిఅన్నివైరుధ్యాలుస్పష్టంగా మరింత తీవ్రంఅయ్యే పరిస్థితులలోనూ ఈదశ ప్రారంభంకావడం అనేది దీనిప్రత్యేక లక్షణం. శాంతికాముక శక్తులుశాంతియుతసహజీవనాన్ని సాధించి, పోషించటానికిగాను జరిపే జయప్రదమైన పోరాటం ద్వారా, సామ్రాజ్యవాదులు తమ దురాక్రమణచర్యలతో ప్రపంచ శాంతికి భంగం కల్గించకుండా నివారించగల్గిన సమయంలో ఈ దశ ప్రారంభమైనది. ప్రజాతంత్రం, జాతీయ స్వాతంత్ర్యం, సోషలిజముల కొరకై విస్తారమైన ప్రజాబాహుళ్యం, జరిపే పోరాటాలు పెరుగుతూవున్న వాతావరణంలో ఈ దశ ప్రారంభమైనది.

సామ్రాజ్యవాద పీడనకు దోపిడీకి వ్యతిరేకంగా అన్ని విప్లవ శక్తులు సమీకరింపబడుచున్నవి. సోషలిజమునూ, కమ్యూనిజమునూ నిర్మించే ప్రజలు, పెట్టుబడిదారీ దేశాలలోని కార్మికవర్గ విప్లవోద్యమం, పీడితప్రజల జాతీయ విముక్తిపుద్యమం, జనరల్ ప్రజాతంత్ర పుద్యమం – మన కాలంలోని ఈ మహత్తర శక్తులన్నీ, ప్రపంచ సామ్రాజ్యవాద వ్యవస్థను శిథిలంచేసి, నాశనంజేసే ఒక బలీయమైన పుద్యమ ప్రవాహంగా మిళితమైపోతున్నవి. అంతర్జాతీయ కార్మికవర్గమూ, దాని ప్రధాన సృష్టియైన ప్రపంచ సోషలిస్టువ్యవస్థ, మనకాలంలోని కేంద్ర శక్తులు. శాంతి, ప్రజాతంత్రము, జాతీయవిముక్తి, సోషలిజము, మానవాభ్యుదయాల కొరకై జరిగే పోరాటంలో విజయం లభించటానికి ఇవి గ్యారంటీగా వుంటున్నవి.

# 2

# సోషలిస్టు వ్యవస్థ పురోగమనంలో నూతన దశ

ప్రపంచ సోషలిస్టువ్యవస్థ అభివృద్ధిలో ఒక నూతనదశ ప్రారంభమైనది. కమ్యూనిస్టు సమాజ నిర్మాణాన్ని పూర్తి స్థాయిలో సోవియట్ యూనియన్ జయప్రదంగా సాగిస్తున్నది; సోషలిస్టు శిబిరంలోని ఇతర దేశాలు సోషలిజానికి పునాదులను జయప్రదంగా నిర్మిస్తున్నవి. వీటిలో కొన్ని ఇప్పటికే అభివృద్ధిపొందిన సోషలిస్టు సమాజ నిర్మాణదశలో ప్రవేశించినవి.

మొత్తం సోషలిస్టువ్యవస్థ నిర్ణయాత్మకమైన విజయాలను సాధించింది. ఈ విజయాలు మార్క్సిజం లెనినిజముల విజయానికి [illegible] ఈ సిద్ధాంత ప్రాతిపదికపై ఏర్పడే సమాజం ఏవిధంగా ఆర్థిక,

సాంస్కృతిక సంపూర్ణాభివృద్ధికి బ్రహ్మాండమైన అవకాశాలను ఏర్పర్చగలదో, ఏ విధంగా ప్రజలకు మిక్కిలి హెచ్చైన జీవన స్థాయినీ, శాంతియుతమైన సుఖప్రదమైన జీవితాన్ని సమకూర్చే అవకాశాలను కల్గించగలదో పెట్టుబడి ప్రాబల్యంక్రిందవున్న ఈవిజయాలు ప్రజానీకం అంతటికీ స్పష్టంగా చూపగలవు.

సప్తవర్ష ఆర్థికాభివృద్ధి ప్రణాళికను జయప్రదంగా సాగిస్తూ సోవియటుప్రజలు కమ్యూనిజానికి భౌతిక టెక్నికల్ పునాదిని త్వరితంగా నిర్మిస్తున్నారు. ప్రపంచ నాగరికతాభివృద్ధిలో దాదాపు నూతనాధ్యాయంగా వుండగలదానిని సోవియటు శాస్త్రవిజ్ఞానం ప్రారంభించింది; విశ్వాంతరాళ పరిశోధనలను తొలిగా ప్రారంభించడంద్వారా సోషలిస్టు శిబిరంయొక్క ఆర్థికాధిక్యతనూ, టెక్నికల్ బలాధిక్యతనూ కళ్ళకుకట్టినట్లుగా చూపెట్టింది. మానవజాతి కమ్యూనిజమువైపుకు చేసేప్రయాణానికి చరిత్రలో వెలుగు బాటను ఏర్పర్చిన మొట్టమొదటి దేశంగా గౌరవంపొందినది సోవియట్ యూనియనే. శాంతి, ప్రజాతంత్రహక్కులు, జాతీయ స్వాతంత్ర్యము, సమాజాభ్యుదయములకొరకై ప్రపంచప్రజలు సాగించే పోరాటంలో వారికి చక్కటి వుదాహరణగానూ, మిక్కిలి బలీయమైన ప్రాపుగానూ వున్నది సోవియట్ యూనియనే.

చైనా ప్రజావిప్లవం ఆసియాఖండంలో సామ్రాజ్య వాదుల స్థానాలకు చావుదెబ్బకొట్టింది; చాలా వరకూ సోషలిజానికి అనుకూలంగా ప్రపంచ శక్తుల బలాబలాలలో మార్పు తెస్తానికి కారణభూతమైనది. జాతీయవిముక్తివుద్యమానికి మరింత బలీయమైన ప్రోత్సాహాన్ని ఇవ్వటం మూలకంగా అది ప్రజలపై, మరీముఖ్యంగా ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా దేశాల లోని ప్రజలపై బ్రహ్మాండమైన ప్రభావాన్ని పడవేసింది. మహత్తర సోవియటు యూనియన్‌తో కలిసి ఆల్బేనియా, బల్గేరియా, హంగరీ, ప్రజాతంత్ర రిపబ్లిక్కులూ, జర్మన్ ప్రజాతంత్ర రిపబ్లిక్, వీట్నాం ప్రజాతంత్ర రిపబ్లికు, చైనా, కొరియా ప్రజాతంత్ర రిపబ్లికు మంగోలియా, పోలెండు, రుమేనియా, జెకోస్లొవేకియా సోషలిస

రిపబ్లికు మిక్కిలి బలీయమైన సోషలిస్టు శిబిరంగా ఏర్పడినవి. ఇవి చారిత్రికంగా అతిస్వల్పమైన కాలంలోనే సోషలిస్టు నిర్మాణంలో గణనీయమైన అభివృద్ధిని సాధించినవి.

ఈ దేశాలలో ప్రజాప్రభుత్వాలు అచంచలమైన దృఢత్వాన్ని కల్గివున్నవని రుజువైనది. వీటి జాతీయార్థికంలో సోషలిస్టు ఉత్పత్తి సంబంధాలు ప్రధానస్థానంలో వున్నవి. మనిషిని మనిషిదోచుకునే పద్ధతికి శాశ్వతంగా స్వస్తిచెప్పబడింది లేక చెప్పబడుతూన్నది. సోషలిస్టు పారిశ్రామికీకరణ పాలసీని జయప్రదంగా అమలుజరపటం మూలకంగా సోషలిస్టు దేశాలలో అర్థికాభివృద్ధి గొప్ప వెల్లువగా సాగింది. ఈ దేశాలు పెట్టుబడిదారీ దేశాలకంటే మిక్కిలి వేగంగా తమ ఆర్థికవ్యవస్థలను అభివృద్ధిచేసుకొంటున్నవి. ఈదేశాలన్నీ అభివృద్ధి పొందిన పరిశ్రమలను నెలకొల్పినవి; లోగడ వ్యావసాయక దేశాలుగా వున్నవి ఇప్పుడు పారిశ్రామిక — వ్యావసాయక దేశాలుగా మారినవి; లేదా మారుచున్నవి.

సోషలిస్టు నిర్మాణంలో కెల్లా మిక్కిలి కష్టమైన సమస్య రైతాంగాన్ని, కొద్దిపాటిగా సాగించే ప్రైవేటు వ్యవసాయంనుండి స్వచ్ఛందంగా సోషలిస్టు పంథాలో సాగే భారీ సహకారవ్యవసాయ పంథాకు మళ్ళించడం; ఈ అతికష్టసాధ్యమైన సమస్యను ఇటీవలి కాలంలో నూతన ప్రజాతంత్రదేశాలు జయప్రదంగా పరిష్కరించినవి లేదా,పరిష్కరిస్తున్నవి. భూమిపై వ్యక్తిగత యాజమాన్యం అనే రైతుల మనస్తత్వం తరతరాలుగా జీర్ణించుకుపోయిన దేశాలకుగానీ, ఇటీవలనే ఫ్యూడల్ సంబంధాలకు స్వస్తిచెప్పిన దేశాలకుగానీ లెనిన్ సూచించిన సహకారప్రణాళిక మిక్కిలి ఉపయుక్తమైనదని రుజువైనది కార్మికవర్గనాయకత్వానవుండే కార్మిక — రైతాంగ సౌహార్ద్రమైత్రి-దీనిని నిలబెట్టడం; దృఢతరం చేయటం అన్నదే శ్రామికవర్గ నియంతృత్వంయొక్క అత్యుత్తమ సూత్రం అని లెనిన్ బోధించాడు—మరింత బలంగా పెరిగింది. సోషలిస్టు వ్యవస్థకు రాజకీయ పునాదిగావుండే [illegible]మిక ప్రజలలోని ఈ రెండు వర్గాలయొక్క ఈ మైత్రి సోషలిస్టు [illegible]ణం సాగుచున్నకొలదీ, అవిరామంగా అభివృద్ధి అవుతూ కార్మిక

వర్గ నాయకత్వాన ప్రజాపరిపాలనను మరింత బలపర్చుతుంది; రైతాంగంయొక్క స్వచ్ఛంద సహకారం అనే లెనినిస్టు సూత్రానికి అనుగుణ్యంగా వ్యవసాయాన్ని సోషలిస్టు పందాలో పునర్నిర్మాణం చేయటానికి దోహదమిస్తుంది.

సమాజంయొక్క సాంఘిక నిర్మాణంలో చరిత్రాత్మకమైన మార్పులు సంభవించినవి. నూతన ప్రజాతంత్ర దేశాలలో భూస్వామిక పెట్టుబడిదారీ వర్గాలింక లేవు. కార్మికవర్గం సమాజంయొక్క ప్రధాన శక్తియైనది. దాని సభ్యుల సంఖ్య పెరుగుచున్నది; దాని రాజకీయ చైతన్యమూ, పరిపక్వతా అభివృద్ధియైనది; సోషలిజం తరతరాల దారిద్ర్యంనుండి రైతాంగాన్ని విముక్తిచేసి, సమాజ పురోగమనంలో దానిని చురుకైన శక్తిగా తయారుచేసింది. శ్రామికప్రజల రక్తంలో రక్తమైన ఒకనూతన, సోషలిస్టుమేధావి బృందం ఉదయిస్తున్నది. పౌరులందరూ విజ్ఞానాన్నీ సంస్కృతినీ పొందగలసంపూర్ణ అవకాశాలు లభ్యమైనవి. ఈ విధంగా, సమాజంయొక్క సంస్కృతి అభివృద్ధికావటానికీ, మానవుని సామర్థ్యాలు, ప్రతిభ సర్వతోముఖంగానూ, సంపూర్ణంగానూ వికసించటానికీ, రాజకీయ పరిస్థితులనేగాక, భౌతిక పరిస్థితులనుకూడా సోషలిజం సృష్టించి పెట్టింది. ఆర్థికాభివృద్ధి ఫలితంగా ప్రజల జీవన స్థాయి కూడా క్రమంగా అభివృద్ధి అవుతూ వున్నది.

అనేక జాతులున్న సోషలిస్టుదేశాలలో అన్ని జాతుల శ్రామిక ప్రజలమధ్య అభేద్యమైన మైత్రి నిర్మించబడి, స్థిరపర్చబడింది. సోషలిస్టుదేశాలలో జాతుల సమస్యగూర్చిన మార్క్సిస్టు లెనినిస్టు పంథా విజయంపొందడం, జాతులమధ్య నిజమైన సమానత్వం ఏర్పర్చబడడం, అవి ఆర్థికంగానూ, సాంస్కృతికంగానూ అభివృద్ధి పొందడం, జాతీయపీడనకు వ్యతిరేకంగా పోరాడే ప్రజలందరకూ ఉత్తేజకరమైన ఉదాహరణగా వుండగలదు.

నూతన ప్రజాతంత్ర దేశాలలో బూర్జువాతత్వ సిద్ధాంతాలతో జరిగేపోరాటంలో సోషలిస్టుతత్వ సిద్ధాంతాలు గణనీయమైన విజయాళ్లనుసాధించినవి. బూర్జువాతత్వ సిద్ధాంతాల అవశేషాల నుండి

ప్రజల మనస్సులను పూర్తిగా విముక్తి చేసేంతవరకూ దీర్ఘపోరాటంగా ఇది సాగుతుంది.

చరిత్రలోకెల్లా మొట్టమొదటిసారిగా సోవియట్ యూనియన్‌లో ప్రభవించి, దృఢంగా నిల్చిన సమాజంయొక్క నైతిక, రాజకీయఐక్యత ఇప్పుడు ఇతర సోషలిస్టుదేశాలలో కూడా వృద్ధి అవుతూ వున్నది. ఉత్పత్తిశక్తుల అభివృద్ధికి దోహదం చేస్తానికీ, సోషలిస్టు సమాజంయొక్క భాగ్యసంపదకు దోహదంచేస్తానికి స్వేచ్ఛాయుతులైన కార్మికుల సృజనాత్మక శక్తియుక్తులను మిక్కిలి సమర్థవంతంగా వుపయోగించటానికి ఇందుమూలకంగా సాధ్యం అవుతున్నది.

సోషలిస్టుసమాజం క్రమాభివృద్ధినొందుతూ, అంతకంతకూ పరిపక్వతపొందుతూవున్నది. భావికమ్యూనిస్టు సమాజంలో శ్రమయెడా, ఇతర ప్రకృతులయెడా కమ్యూనిస్టు వైఖరి ఎట్లావుంటుందో అది నిరూపించుతూ వున్నది. సోషలిస్టు ఆర్థిక యాజమాన్య పద్ధతులూ, ఆర్థిక ప్రణాళికా పద్ధతులూ క్రమంగా అభివృద్ధి అవుతూ వున్నవి. సోషలిస్టు ప్రజాతంత్రం అభివృద్ధి అగుట సాగుతూనేవున్నది. ఆర్థిక, సాంస్కృతికాభివృద్ధిని నడిపించడంలో ప్రజాసామాన్యం అంతకంతకూ ఎక్కువపాత్రనువహిస్తున్నారు; ప్రభుత్వం నిర్వహించే కొన్ని విధులు క్రమంగా పబ్లిక్ సంస్థలకు వప్పగించ బడుచున్నవి.

నేడు సోవియటు యూనియనులోనే గాక ఇతర సోషలిస్టుదేశాలలో సహితం పెట్టుబడిదారీ విధానాన్ని పునః ప్రవేశపెట్టడం సామాజికంగా గాని, ఆర్థికంగాగాని అసాధ్యం చేయబడింది. సామ్రాజ్యవాద అభివృద్ధి విరోధక శక్తిఅతిక్రమణలనుండి ప్రతి ఒక్క సోషలిస్టుదేశాన్నీ సోషలిస్టు శిబిరంయొక్క సంయుక్త శక్తులునమ్మకంగా కాపాడుతాయి. ఈ విధంగా, సోషలిస్టుదేశాలన్నీ ఒకే శిబిరంలోకి సమీకృత మగుట మూలకంగానూ, ఈ శిబిరంయొక్క ఐక్యత పెరుగుతూ వుండటం, బలం క్రమంగా అధికంకావటం మూలకంగానూ, మొత్తం ఈ వ్యవస్థ అంతటా సోషలిజం సంపూర్ణవిజయాన్ని పొందటానికి హామీ ఏర్పడింది.

కార్మికవర్గమూ, రైతాంగముల వీరోచిత కృషిమూలకంగానూ, కమ్యూనిస్టు, కార్మికపార్టీల బ్రహ్మాండమైన కృషిఫలితంగానూ, గత సంవత్సరాలలో ఉత్పత్తిశక్తులు మరింతవేగంగా అభివృద్ధికావటానికీ, పెట్టుబడిదారీవిధానంతోటి జరిగే శాంతియుత ఆర్థిక పోటీలో సోషలిస్టుదేశాలు సాధ్యమైనంత పెచ్చువ్యవధిని సంపాదించటానికీ, విజయాన్ని సాధించటానికి మిక్కిలి అనుకూలమైన భౌతికపరిస్థితులు సమకూర్చబడివున్నవి. సోషలిస్టుదేశాలకు నాయకత్వం వహించుచున్న మార్క్సిస్టు - లెనినిస్టు పార్టీలు ఈ సదవకాశాలను సరిగా వుపయోగించుకొవటాన్ని తమ విధ్యుక్తధర్మంగా ఎంచుచున్నవి.

గొప్ప విజయాలను సాధించటుంద్వారానూ, తీవ్రమైన పరీక్షలకు తాళి నిలబడడంద్వారానూ కమ్యూనిస్టుపార్టీలు సోషలిస్టు నిర్మాణాన్ని నడపటంలో తగినంత, వివిధమైన అనుభవాన్ని సంపాదించినవి. ఒక్కొక్క దేశంలోనూ వున్న చారిత్రక ప్రత్యేక లక్షణాలనూ, మొత్తం సోషలిస్టు శిబిరంయొక్క ప్రయోజనాలనూ గుర్తుంచుకొని, సోషలిస్టు నిర్మాణాన్ని శాసించే సర్వసామాన్య భౌతిక సూత్రాలను సరిగా అనువర్తింపజేయటం వల్లనే సోషలిస్టు దేశాలూ, మొత్తం సోషలిస్టు శిబిరమూ తమ విజయాలను సాధించగల్గినవి; ఈ దేశాలలోని ప్రజలకృషిమూలకంగా వారిమధ్య ఏర్పడిన ఘనిష్టమైన సౌహార్ద సహకారం, పరస్పర అంతర్జాతీయ సహాయముల మూలకంగానూ అన్నిటికంటె ముఖ్యంగా సోవియట్ యూనియన్ నుండి అందిన సౌహార్ద, అంతర్జాతీయ సహాయం మూలకంగానూ ఇవి ఈ విజయాలను సాధించగల్గినవి.

సోషలిస్టుదేశాల అభివృద్ధి నేర్పేఅనుభవం ఒక్కవిషయాన్ని రుజువు చేస్తున్నది: సోషలిస్టు శిబిరంలోని దేశాలు తమ కర్తవ్యాలను సాధించటానికైనా, విజయాలను సాధించటానికైనా ప్రప్రధానంగానూ అంతర్జాతీయంగానూ కావలసినషరతు ఏమిటంటే ఈ దేశాల మధ్య పరస్పర సహాయము ప్రాపువుండడమూ, వీటిమధ్య వుండే మైత్రి, ఐక్యతలవల్ల కల్గేప్రయోజనాలను వుపయోగించుకొనటము అనేవి. సోషలిస్టు శిబిరంలో చీలిక కల్గుతుందని సామ్రాజ్యవాదులూ,

కమ్యూనిస్టు ద్రోహులూ, మార్క్సిజం ప్రతిభాష్యకారులూ ఆశించే ఆశలన్నీ ఇసుకలో కట్టిన ఇండ్లు; ఇవి తప్పక కూలిపోగలవు. సోషలిస్టు దేశాలన్నీ సోషలిస్టు శిబిరంయొక్క ఐక్యతను కంటిలోని పాప వలె రక్షించుకొంటాయి.

సోషలిస్టుప్రపంచ ఆర్థిక వ్యవస్థ సార్వజనీన సోషలిస్టు ఉత్పత్తి సంబంధాల వల్ల ఐక్యపర్చబడుతూ సోషలిస్టు ఆర్థికసూత్రాల కనుగుణ్యంగా అభివృద్ధి అవుతూవున్నది. అది జయప్రదంగా అభివృద్ధి కావాలంటే సోషలిస్టు నిర్మాణం, ఒక ప్లానుప్రకారం, ఒక నిర్ణీత నిష్పత్తి ప్రకారం అభివృద్ధి కావడం అనే సూత్రాన్ని ఖచ్చితంగా వర్తింపజేయాలి; ప్రజల సృజనాత్మక చొరవను ప్రోత్స హించాలి; అంతర్జాతీయ శ్రమవిభజనపద్ధతిని సదాఅభివృద్ధి జేయాలి. ఈ శ్రమ విభజనను అమలుజరపటానికి జాతీయార్థిక ప్రణాళికలను సమన్వయం చేయటం అవసరం; శాస్త్రీయ, సాంకేతిక ప్రమాణాలను త్వరితంగా అభివృద్ధి చేయటం, స్వచ్ఛందంగా పాల్గొనటం, పరస్పర లాభాలను పొందటం అనే ప్రాతిపదికపై, ప్రపంచ సోషలిస్టు ఆర్థికవ్యవస్థ పరిధిలోనే, కొన్ని వుత్పత్తి రంగాలలో ప్రత్యేక ప్రావీణ్యతను సంపాదించటమూ, పరస్పర సహకారాన్ని పెంపొందించడమూ అవసరము. ఇందుకు సమిష్టి అనుభవాన్ని అధ్యయనం చేయాలి; సహకారాన్నీ, పరస్పర సౌహార్ద సహాయాన్నీ అధికం చేయాలి. ఈ మార్గాలద్వారా, ఆర్థికాభివృద్ధి స్థాయిలలో చారిత్రకంగా ఏర్పడిన హెచ్చుతగ్గులను క్రమేణా అంతమొందించి, సోషలిస్టు వ్యవస్థలోని అన్ని దేశాల ప్రజలూ కొద్దోగొప్పో ఒకే కాలంలో కమ్యూనిజానికి పరివర్తన చెందటానికి భౌతిక పునాది వేయాలి.

వేర్వేరు దేశాలలో సోషలిస్టు నిర్మాణం మొత్తం సోషలిస్టు శిబిరంయొక్క సమిష్టి అనుభవానికి మూలంగా వుంటున్నది. ఈ అనుభవాన్ని సౌహార్ద పార్టీలు క్షుణ్ణంగా అధ్యయనం చేయడం, ప్రత్యేక పరిస్థితులనూ, జాతీయ ప్రత్యేక లక్షణాలను దృష్టిలో పెట్టుకొని ఈ అనుభవాల్ని ఉపయోగించుకొనటమూ, విస్తరింప జేయటమూ

అవసరం. ఇది ప్రతిసోషలిస్టుదేశముయొక్క అభివృద్ధిలోని తిరుగు లేని సూత్రం.

తమకున్న అవకాశాలకు అనుగుణ్యంగా తమదేశాల పారి శ్రామిక వ్యావసాయిక వుత్పత్తిని హెచ్చుచేటున అభివృద్ధి చేయ టంలో సోషలిస్టు దేశాలలోని కమ్యూనిస్టు, కార్మికపార్టీలు ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థయొక్క మొత్తం పారిశ్రామిక, వ్యావసాయిక వుత్పత్తిని అధిగమించటమూ, అటుపిమ్మట, మిక్కిలి అర్థికంగా అభి వృద్ధిజెందిన పెట్టుబడిదారీదేశాలయొక్క తలసరి వుత్పత్తినీ, జీవన స్థాయినీ అధిగమించటమూ అనే చారిత్రకకర్తవ్యాన్ని ఉమ్మడి కృషి ద్వారానూ, సాధ్యమైనంత త్వరగానూ నిర్వహించుటకు పూను కుంటాయి. ఇందుకు గాను సోషలిస్టు వ్యవస్థయొక్క అన్ని అవకాశా లనూ ప్రతి దేశంయొక్క అంతరంగిక వనర్లనూ పూర్తిగా వుపయో గించుటను అంతర్జాతీయ ధర్మంగా భావిస్తాయి. ఈ కర్తవ్యాన్ని నెరవేర్చాలంటే రాజకీయ, అర్థికకృషిని త్వరగా అభివృద్ధిచేయడం, అర్థిక యాజమాన్యం పద్ధతులను సదా మెరుగుపర్చడం, సోషలిస్టు అర్థికాన్ని శాస్త్రీయ పద్ధతులపై నడపడమూ అవసరము. ఇందుకు గాను శ్రమయొక్క ఉత్పాదకశక్తిని మరింత హెచ్చుజేయాలి. ఇది చేయాలంటే సదా సాంకేతికాభివృద్ధిని సాధించాలి; అర్థికాన్ని ప్లానుప్రకారం నడపాలి; భౌతిక లాభాలను సమకూర్చడం ద్వారా ఉత్పత్తికి ప్రోత్సాహం కల్గజేయడం, ప్రజల రాజకీయ చైతన్యాన్ని పెంచి సమాజ శ్రేయస్సుకై పనిచేయుటకుగాను వారికి నైతిక ప్రోద్బ లాన్ని కల్పించటం అనే లెనినిస్టుసూత్రాన్ని ఖచ్చితంగా అమలు జరపాలి. ఈవిధంగా శ్రమశక్తియొక్క ఉత్పాదకశక్తిని పెంచటమే గాక, శ్రమ, వస్తు వినియోగములపై కంట్రోలు చేయటం కూడ అవసరం.

సోషలిస్టు దేశాలు కమ్యూనిజానికి పరివర్తనం చెందటానికి గాను అధునాతన సాంకేతిక నైపుణ్యాన్ని వుపయోగించటంద్వారాను జాతీయార్థికాన్ని విద్యుచ్ఛక్తిమయం చేయటంద్వారానూ, వుత్పత్తిని యాంత్రీకరణచేయటం, స్వయంచోదితం చేయటంద్వారాను ఉత్పత్తిని

హెచ్చుస్థాయికి తీసుకుపోవటం విధిగా జరిగితీరాలి; ఇందుమూలంగా కాకపోతే కమ్యూనిస్టు వ్యవస్థకు అవసరమైన వాడకం వస్తువులు కోకొల్లలుగా అందించడం అసాధ్యమౌతుంది. ఈ ప్రాతిపదికపై కమ్యూనిస్టు సామాజిక సంబంధాలను పెంపొందించటమూ, ప్రజల రాజకీయ చైతన్యాన్ని శక్తివంతముగా వృద్ధినొందించటమూ నూతన కమ్యూనిస్టుసమాజంయొక్క సభ్యుల చైతన్యాన్ని పెంచటమూ అవసరం.

సోషలిస్టుశిబిరం ఘనిష్టమైన అంతర్జాతీయ సోషలిస్టు సౌహార్ద్రతాబంధాలవల్లనూ, ఉమ్మడి ప్రయోజనాలూ, లక్ష్యాలవల్లనూ ఐక్యంచేయబడివున్నట్టి సంఘము; సోషలిజము, కమ్యూనిజముల పంథానసాగుతున్నట్టి స్వేచ్ఛాయుత, సర్వసత్తాక ప్రజల సాంఘిక, ఆర్థిక, రాజకీయ, సంఘము. మార్క్సిజం లెనినిజం సూత్రాలకూ, సోషలిస్టు అంతర్జాతీయతత్వానికీ ఖచ్చితంగా కట్టుబడి వుండటమనేది సోషలిస్టు దేశాలమధ్యవుండే పరస్పర సంబంధాలకు సంబంధించిన అనుల్లంఘనీయ సూత్రము. సోషలిస్టు శిబిరంలో వున్న ప్రతిఒక్క దేశానికీ సమాన హక్కులూ, స్వాతంత్ర్యమూ నిజంగా గ్యారంటీ చేయబడివున్నవి. సంపూర్ణ సమానత, పరస్పర ప్రయోజనము, సౌహార్ద్రత, పరస్పర సహాయమూ అనే సూత్రాలకు కట్టుబడివుంటూ సోషలిస్టుదేశాలు తమ సర్వతోముఖ రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక సహకారాన్ని పెంపొందించు కొంటాయి; ఇవి ప్రతి ఒక్క సోషలిస్టు దేశంయొక్క ప్రయోజనాలకూ, మొత్తం సోషలిస్టు శిబిరంయొక్క ప్రయోజనాలకూ, రెండింటికీ అనుగుణ్యమైనవి.

వర్గ వైషమ్యాలు క్షీణించటంతోబాటు జాతీయ వైషమ్యాలు కూడా క్షీణించుతాయి అన్న మార్క్సిస్టు – లెనినిస్టు సిద్ధాంతం ఆచరణలో పూర్తిగా రుజువుఅయింది. ఇది ప్రపంచ సోషలిస్టు వ్యవస్థయొక్క మహత్తర విజయాలలో ఒకటి. సాయుధఘర్షణలకు దారితీసే వైషమ్యపు వైరుధ్యాలు వర్గాలమధ్య, జాతుల మధ్య, దేశాలమధ్యా వుండటం పెట్టుబడిదారీవిధానంయొక్క సూత్రాలు; ఇందుకు విరుద్ధంగా సోషలిస్టువిధానానికి చెందిన ప్రజలమధ్యగాని,

దేశాలమధ్యగాని వైరుధ్యాలుగాని, సంఘర్షణలుగాని వుండటానికి వీలులేదు; ఇట్టి వైరుధ్యాలు వస్తానికి సోషలిస్టు విధానంయొక్క స్వభావంలో ఏలాంటి వాస్తవిక కారణాలూ లేవు. దాని అభివృద్ధి, దేశాలమధ్యా. జాతులమధ్యా మరింత హెచ్చైన ఐక్యత ఏర్పడటానికీ, వాటిమధ్య అన్ని రూపాలసహకారమూ స్థిరపడటానికి దారితీస్తుంది. సోషలిజంలో, జాతీయార్థికం, సంస్కృతీ, రాజ్యాంగములయొక్క అభివృద్ధి మొత్తం ప్రపంచ సోషలిస్టువ్యవస్థ బలాధిక్యతతోనూ, అభివృద్ధితోనూ జతగానే సాగుతుంది; జాతులమధ్య ఐక్యత మరింత హెచ్చుగా స్థిరపడడంతో జతగా సాగుతుంది. మొత్తం సోషలిస్టు వ్యవస్థయొక్క ప్రయోజనాలూ, జాతీయ ప్రయోజనాలూ శ్రుతికలిసి వున్నవి. మహత్తరమైన సోషలిస్టు సంఘమందలి మొత్తం ప్రజలందరి యొక్క నైతిక, రాజకీయైక్యత ఈ ప్రాతిపదికపైననే పుట్టి, పెరుగుతూ వున్నది. రాజకీయపు ఒంటరితనమూ, జాతీయాహంకారమూ పెట్టుబడిదారీవిధానానికి సహజం; వీటిని త్రోసిపుచ్చి, సోషలిస్టు వ్యవస్థ నుండి వుద్భవించిన సౌహార్ద స్నేహమూ, పరస్పర సహాయమూ వివిధ ప్రజలమధ్య నెలకొనినవి.

సోషలిస్టుదేశాలప్రజల ఉమ్మడి ప్రయోజనాలూ, శాంతి సోషలిజముల ప్రయోజనాలూ, సోషలిస్టు అంతర్జాతీయత సిద్ధాంత రాజకీయాలతో సోషలిస్టు దేశభక్తిని సరిగా మేళవింపజేయాలని కోరుచున్నవి. దేశంలో పరిపాలకపార్టీగా తయారైన ప్రతిఒక్క కమ్యూనిస్టుపార్టీ తన దేశంయొక్క భవిష్యత్తుకూ, మొత్తం సోషలిస్టు శిబిరంయొక్క భవిష్యత్తుకూ చారిత్రకంగా జవాబుదారీవహించుతోంది.

జాతీయ ప్రత్యేకలక్షణాల పాత్రకు అవసరాన్నిమించి ప్రాముఖ్యత ఇవ్వటంవల్లా, సోషలిస్టు విప్లవాన్నిగూర్చి, సోషలిస్టు నిర్మాణాన్నిగూర్చి మార్క్సిజం–లెనినిజములు బోధించే విశ్వజనీన సత్యం నుండి పక్కకు తొలగడంవల్లా సోషలిజంయొక్క ఉమ్మడి ఆశయం దెబ్బతింటోందని 1957 ప్రకటన సరిగ్గా చెప్పింది. ఒకానొక దేశంలో వుండే ప్రత్యేక చారిత్రికపరిస్థితులను ఆధారంజేసుకొని సోషలిస్టు

విప్లవం, సోషలిస్టు నిర్మాణముల గూర్చిన జనరల్ సూత్రాలను సృజనాత్మకంగా అమలు జరపాలని మార్క్సిజం–లెనినిజం కోరుతోందనీ ఇతర దేశాల కమ్యూనిస్టుపార్టీల పాలసీలనూ, ఎత్తుగడలనూ యాంత్రికంగా అనుసరించటానికి ఒప్పుకోదనీ కూడా ఆ ప్రకటన సరిగ్గా చెప్పింది. జాతీయ విశిష్టలక్షణాలను నిర్లక్ష్యం చేయటం మూలకంగా శ్రామికవర్గపార్టీ వాస్తవంనుండీ, ప్రజాసామాన్యం నుండీ, వేరగుటకు దారితీస్తుంది; సోషలిస్టు ఆశయానికే హాని జరుగుతుంది.

సోషలిస్టు వ్యవస్థను ఏర్పర్చడంద్వారా జాతీయ దురహంకార తత్వంయొక్క, జాతీయ సంకుచితత్వంయొక్క లక్షణాలు వాటంతట అవే అదృశ్యంకావు. సోషలిస్టుదేశాల మధ్య సౌహార్దసంబంధాలూ, స్నేహమూ బలపడాలంటే కమ్యూనిస్టు కార్మికపార్టీలు మార్క్సిస్టు–లెనినిస్టు అంతర్జాతీయ పంథాన నడవవలసి వుంటుంది. మొత్తంశ్రామిక ప్రజలు అంతర్జాతీయత, దేశభక్తి తత్వంలో తర్ఫీదుచేయబడవలసి వుంటుంది. బూర్జువా జాతీయత, జాతీయ దురహంకారముల అవశేషాలను నిర్మూలిస్తానికి దీక్షతో పోరాటాన్ని జరపవలసివుంటుంది.

కమ్యూనిస్టు కార్మిక పార్టీలు సోషలిస్టు అంతరాతీయతత్వాన్నీ, సంకుచిత జాతీయత, జాతీయ దురహంకారముల ఛాయలయెడ అసహనాన్నీ అవిరామంగా కార్మిక ప్రజలకు బోధిస్తాయి. కమ్యూనిస్టు కార్మిక పార్టీల దృఢమైన ఐక్యత, సోషలిస్టు దేశాల ప్రజలమధ్య దృఢమైన ఐక్యత మార్క్సిస్టు లెనినిస్టు సిద్ధాంతంయెడ వారివిధేయత, ఇవే ప్రతి ఒక్క సోషలిస్టు దేశంయొక్క బలానికీ, అజేయతకూ, మొత్తం సోషలిస్టు శిబిరంయొక్క బలానికి, అజేయతకూ మూలకారణం.

కమ్యూనిజానికి వెలుగుబాటను వేయడంద్వారా సోషలిస్టు దేశాల ప్రజలు మొత్తం మానవజాతికే నూతనమైన సమాజం యొక్క నమూనాను నిర్మిస్తున్నారు. పెట్టుబడిదారీదేశాల కార్మిక ప్రజలు సోషలిజం కమ్యూనిజంలను నిర్మించే నిర్మాతలయొక్క నిర్మాణాత్మకకృషిని మిక్కిలి ఆకాంక్షతో చూస్తున్నారు. ఇందుమూలకంగా, సోషలిస్టుదేశాల మార్క్సిస్టు లెనినిస్టుపార్టీలూ, ప్రజలూ సోషలి

జాన్ని, కమ్యూనిజాన్ని జయప్రదంగా నిర్మించటంలో అంతర్జాతీయ కార్మికోద్యమానికి జవాబుదారీ వహించవలసివున్నది.

ఏడాదికేడాది ప్రపంచఘటనల పరిణామగతిలో మహత్తర సోషలిస్టుదేశాల కూటమియొక్క అంతర్జాతీయపాత్రా, పలుకుబడీ పెరుగుచున్నని. అందుచే ఈసోషలిస్టుదేశాలకూటమిని నిర్విరామంగా బలపర్చటం తమకర్తవ్యంగా కమ్యూనిస్టు కార్మికపార్టీలుచూస్తున్నవి.

సోషలిస్టు దేశాలు ఒక ప్రపంచ వ్యవస్థగా ఏర్పడి, ప్రపంచ గతిపై బలమైన ప్రభావాన్ని ప్రసరింపజేసే అంతర్జాతీయ శక్తిగా తయారైన సమయం ఏతెంచింది. ఆధునిక కాలంలోని కీలకసమస్యలను నూతన పంథాలో, శాంతి, ప్రజాతంత్రము, సోషలిజముల ప్రయోజనాలకు అనుగుణ్యంగా పరిష్కరించే విజమైన అవకాశాలు ఇప్పుడు ఏర్పడ్డాయి.

# 3

# శాంతి, శాంతియుత సహజీవనాల కోసం జరిగే పోరాటం

యుద్ధం, శాంతి సమస్య మనకాలంలో కెల్లా మిక్కిలి తక్షణ సమస్య.

పెట్టుబడిదారీవిధానానికి యుద్ధం తోడునీడ. మనిషిని మనిషి దోచుకునే వ్యవస్థా, మనిషిని మనిషి రూపుమాపే వ్యవస్థా పెట్టుబడిదారీ వ్యవస్థకు రెండురూపాలు. సామ్రాజ్యవాదం యిప్పటికే రెండుసార్లు మానవజాతిని వినాశనకర ప్రపంచ యుద్ధాలకు గురిచేసింది. మరల యిప్పుడు మరొక బ్రహ్మాండమైన మారణ హోమంలోముంచెత్తే ప్రమాదాన్ని తెచ్చిపెడుతోంది. ప్రజానీకాన్ని

మూకవుమ్మడిగా నాశనం చేసేటటువంటీ, రూపుమాపే టువంటీ రాక్షస సాధనాలు కనిపెట్టబడ్డాయి; ఒక కొత్త యుద్ధంలో గనుక అవి ప్రయోగింపబడితే మొత్తందేశాలకు దేశాలకే కనివిని ఎరుగని సర్వనాశనం సంభవించగలదు; ప్రపంచ పరిశ్రమలయొక్క, సంస్కృతి యొక్క కీలకకేంద్రాలు భస్మీభూతమై పోగలవు. కోటానుకోట్ల ప్రజలకు ఇటువంటియుద్ధం మృత్యువునూ, విపరీత కష్టాలనూ తెస్తుంది; ఈ యుద్ధంలోపాల్గొనని దేశాల ప్రజలుకూడా యిందులో వుంటారు. సామ్రాజ్యవాదం మొత్తం మానవజాతికే భయంకరమైన ప్రమాదాన్ని తెచ్చిపెట్టుతోంది.

ఇదివరకు ఎన్నడూకంటె ప్రజలు ఇప్పుడు మరింత ఎక్కువ జాగరూకతతో వుండాలి. సామ్రాజ్యవాదం వున్నంతవరకూ దురాక్రమణ యుద్ధాలకు స్థావరం వుంటుంది.

**నూతన ప్రపంచయుద్ధప్రమాదం ఇంకా వున్నదని అన్నిదేశాల ప్రజలకూ తెలుసు. అమెరికన్ సామ్రాజ్యవాదమే దురాక్రమణకూ, యుద్ధానికీ ప్రధానశక్తి.** తీవ్ర అభివృద్ధినిరోధక తత్వచింతనయే దాని పాలసీ స్వరూపం. "కమ్యూనిస్టు ప్రమాదాన్ని" యెదుర్కొనడమనే ముసుగుక్రింద అమెరికన్ సామ్రాజ్యవాదులు, బ్రిటను, ఫ్రాన్సు, పశ్చిమజర్మనీ సామ్రాజ్యవాదులతో కలిసి చాలా ఇతర దేశాలను నాటో, సెంటో, సియాటో మున్నగు సైనిక కూటములలోకి ఈడ్చారు. "స్వేచ్ఛా ప్రపంచం" అనబడుతూ, తనపై ఆధారపడి బ్రతికే పెట్టుబడిదారీ దేశాలను, ప్రధానంగా సోషలిస్టు దేశాలకు వ్యతిరేకంగా ఎక్కుపెట్టబడిన మిలిటరీ స్థావరాలవలలో చిక్కువడజేశారు. ఈ కూటములయొక్క, స్థావరాల యొక్కమనుగడ విశ్వశాంతికి, భద్రతకూ ప్రమాదాన్ని కల్గజేస్తోంది; అంతేకాదు, ఏదేశాలైతే తమ భూభాగాన్ని అమెరికన్ సైనికోన్మాదుల స్వాధీనంలో పెట్టారో ఆ దేశాల సార్వభౌమత్వంపై అతిక్రమణ చేయటమేగాక, మనుగడకుకూడా ప్రమాదాన్ని తెచ్చిపెట్టుతోంది.

అమెరికా, బ్రిటన్, ఫ్రాన్సుల సామ్రాజ్యవాద శక్తులు పశ్చిమ జర్మనీ సామ్రాజ్యవాదంతో దుర్మార్గపు ఒప్పందం చేసుకొ

న్నారు. పశ్చిమజర్మనీలో సైనికతత్వం పునరుద్ధరించబడింది. హిట్లరు సేనానుల నాయకత్వాన విస్తారమైన రెగ్యులర్ సైన్యం ఒకటి క్రమంగా వృద్ధిచేయబడుతోంది. ఈసైన్యానికి అమెరికన్ సామ్రాజ్య వాదులు అణుఆయుధాలు, రాకెట్లు, ప్రజా నాశనాన్నిగావించే ఇతరఆధునిక మారణాయుధాలూ ఇచ్చి సర్వసన్నద్ధం చేస్తున్నారు. శాంతికాముక ప్రజలందరూ ఇందుకు గట్టినిరసన తెలియజేస్తున్నారు. ఈ దురాక్రమణ సైన్యానికి ఫ్రాన్సులోనూ, తదితర పశ్చిమ యూరోపియను దేశాలలోనూ మిలిటరీ స్థావరాలు కల్పిస్తున్నారు. పశ్చిమ జర్మను సామ్రాజ్యవాదంనుండి యూరపియను రాజ్యాల శాంతికీ, భద్రతకూ ప్రమాదం ఏర్పడి నానాటకీ వృద్ధి అవుచున్నది. రెండవ ప్రపంచయుద్ధం తర్వాత ఏర్పర్చిన సరిహద్దులను మార్చ టమే తమ అభీష్టమని పగదీర్చ గోరే పశ్చిమ జర్మన్లు బహిరంగంగా ప్రకటిస్తున్నారు. తమ కాలంలో హిట్లరు ముఠా చేసినట్లే పశ్చిమ జర్మనీ సైనికతత్వవాదులు యూరపులోని సోషలిస్టు దేశాలకూ, ఇతర దేశాలకూ వ్యతిరేకంగా యుద్ధానికి తయారవుతూ, తమ దురాక్రమణ ప్లానులను ఆచరణలో పెట్టు ప్రయత్నిస్తున్నారు. అంతర్జాతీయ స్థాయిని అశాంతిని రెచ్చగొట్టే స్థానముగా పశ్చిమబెర్లిను తయారు చేయబడింది. శాంతియుత సహజీవనానికీ, ఆయుధ విసర్జనకూ, యూరపులో ఏర్పడిన ఉద్రిక్త వాతావరణంలో సడలింపు వస్తానికి బద్ధ శత్రువుగా బాన్ ప్రభుత్వం తయారైనది. పశ్చిమ జర్మను సామ్రాజ్యవాదులు వేస్తున్న దురాక్రమణ ప్లానులను యూరపులోని శాంతికాముక దేశాలూ, జాతులూ అన్నీ తమ ఐక్యబలంతో ఎదుర్కొని తీరాలి. పశ్చిమజర్మను సామ్రాజ్యవాదుల దురాక్రమణ కుట్రులకు వ్యతిరేకంగా జరిగే పోరాటంలో జర్మను ప్రజాతంత్ర రిపబ్లికు ప్రత్యేకమైన పెద్దపాత్రను వహిస్తోంది. పశ్చిమ యూరపులో సోషలిజంయొక్క కాపలాదారూ, జర్మన్ జాతియొక్క శాంతివాంఛలయొక్క ప్రతిబింబమూ అయిన జర్మను ప్రజాతంత్ర రిపబ్లి కును రక్షించడం సోషలిస్టుశిబిరంలోని అన్నిదేశాల యొక్క కర్తవ్య

మనీ అన్ని శాంతికాముక దేశాలయొక్క కర్తవ్యం అనీ ఈ సమావేశం భావిస్తున్నది.

దూరప్రాచ్యంలో యుద్ధపు సుడిగుండాన్ని పునరుద్ధరించటంలో కూడా అమెరికన్ సామ్రాజ్యవాదులు చురుకుగా పనిచేస్తున్నారు. జపాన్ ప్రజల జాతీయస్వాతంత్ర్యాన్ని కాళ్ళక్రింద మట్టగిస్తూ, జపాను ప్రజల యిచ్ఛకు వ్యతిరేకంగా వారు జపాను అభివృద్ధి నిరోధకపాలకవర్గ ముఠాతో కలిసి ఒక నూతన సైనికసంధిని ఆ దేశంపై రుద్దారు. ఈ సైనికసంధి సోవియట్ యూనియన్‌కూ, చైనా ప్రజారిపబ్లికుకూ, ఇతరశాంతికాముక దేశాలకూ వ్యతిరేకంగా దురాక్రమణ లక్ష్యాలను కొనసాగించే సంధి. చైనా ప్రజా రిపబ్లికుకు చెందిన తైవాన్ దీవినీ, దక్షిణ కొరియాను అమెరికన్ దురాక్రమణపరులు ఆక్రమించుకొన్నారు. దక్షిణవియత్నామ్ వ్యవహారాలలో అంతకంతకు హెచ్చుజోక్యాన్ని కల్గించుకొంటున్నారు. వీటిని వారు ప్రమాదకరమైన సైనిక కవ్వింపులకూ, జూదాలకూ కేంద్రాలుగా చేశారు. క్యూబాపై దురాక్రమణ జరుపుతామని భయపెట్టుతూవున్నారు; లాటిన్ అమెరికా, ఆఫ్రికా, మధ్యాసియా దేశాల వ్యవహారాలలో జోక్యంకల్గజేసుకొంటున్నారు; ఈ విధంగా అమెరికన్ సామ్రాజ్యవాదులు ప్రపంచంలోని వివిధ ప్రాంతాలలో కొత్త యుద్ధపీఠాలను ఏర్పర్చటానికి ప్రయత్నిస్తున్నారు. తమ ఆర్థిక, రాజకీయపు కంట్రోలును నిలబెట్టుకొంటానికీ, తమ దురాక్రమణప్లానులను సాధించుకొనటంలో సహాయంగా లాటిన్ అమెరికా ప్రజలను ఈడ్వడానికి అమెరికన్ రాజ్యాలసంఘంలాంటి ప్రాంతీయకూటములను ఏర్పర్చే కొత్త రూపాలను వారు చేబట్టుచున్నారు.

అమెరికన్ సామ్రాజ్యవాదులు బ్రహ్మాండమైన యుద్ధ యంత్రాన్ని నిర్మించుకొన్నారు; దానిని తగ్గించటానికి వారు నిరాకరిస్తున్నారు. నిరాయుధీకరణకై సోవియట్ యూనియన్, ఇతర శాంతికాముక దేశాలూ చేసిన నిర్మాణాత్మకపు ప్రతిపాదనలన్నిటినీసామ్రాజ్యవాదులు నిరాకరిస్తున్నారు. ఆయుధపోటీ సాగుతూనేఉన్నది.

అటుంబాంబుల దొంతరలు ప్రమాదకరంగా పెరుగుతూ వున్నవి. తమ - దేశప్రజల యొక్క, ఇతర దేశప్రజలయొక్క, ముఖ్యంగా ఆఫ్రికా ఖండపు ప్రజలయొక్క నిరసనను లెక్కజేయకుండా ఫ్రెంచి పాలకవర్గ ముఠాలు అటుంబాంబులను పరీక్షిస్తూనూ వున్నారు, నిర్మిస్తూనూ వున్నారు. అమెరికన్ యుద్ధోన్మాదులు వినాశనకరమైన అణుబాంబుల ప్రయోగ పరీక్షలను తిరిగి ప్రారంభించ తయారౌతు న్నారు; తీవ్రమైన అంతర్జాతీయ సంఘర్షణలకు దారితీసే మిలిటరీ కవ్వింపులు సాగుతూనే వున్నవి.

తమ కవ్వింపుచర్యలద్వారానూ, దురాక్రమణ చర్యల ద్వారానూ, అమెరికన్ పాలకవర్గముఠాలు నాలుగు పెద్దరాజ్యాల ప్రభుత్వాధిపతుల పారిస్ సమావేశాన్ని భగ్నంచేశారు; అంతర్జాతీయ ఉద్రిక్తతను అధికం చేస్తానికీ, ప్రచ్ఛన్నయుద్ధాన్ని ప్రకోపింప చేస్తానికీ పూనుకొన్నారు. యుద్ధ ప్రమాదం పెరిగింది.

శాంతికి వ్యతిరేకంగా సామ్రాజ్యవాదులు సాగించే కవ్వింపు చర్యలు ప్రజలక్రోధాన్నీ, ప్రతిఘటననూ ఇనుమడింప జేసినవి; అమెరి కన్ సామ్రాజ్యవాదం మరింత ఎక్కువగా బట్టబయలు అయినది; ప్రపంచంలో దాని పలుకుబడికి కొత్త ఆఘాతాలు, బలమైన దెబ్బలు తగిలినవి.

సామ్రాజ్యవాదంయొక్క దురాక్రమణ స్వభావం మారలేదు. కాని దాని దురాక్రమణ ప్లానులను వమ్ముచేయ శక్తిగల వాస్తవ శక్తులు అవతరించినవి. యుద్ధం విధిగా అనివార్యంకాదు. సామ్రాజ్య వాదులు తాము కోరినది తాము చేయగల్గేవుంటే ఈ పాటికి వారు మానవజాతిని ఒక కొత్త ప్రపంచ యుద్ధం యొక్క భీభత్సపు అఖా తంలో ముంచెత్తెడివారు. కాని యుద్ధంరావాలా, రావద్దా అనేది తమ యిచ్ఛ ప్రకారం సామ్రాజ్యవాదులు నిర్ణయించేరోజులు గడిచి పోయాయి. గడచిన సంవత్సరాలలో సామ్రాజ్యవాదులు స్థానిక యుద్ధాలను ప్రారంభించడం ద్వారా కొన్ని పర్యాయాలు మానవ జాతిని ప్రపంచ వినాశనం దరిదాపులకు తీసుకువచ్చారు. సోవియటు యూనియనూ, ఇతర సోషలిస్టు దేశాలూ, శాంతికాముకశక్తులూ అన్ని

దృఢమైన వైఖరిని అవలంబించడం ఫలితంగా సంక్షిప్తులో ఆంగ్లో - ఫ్రెంచి-ఇజ్రేయిల్ దాడి అంతమొందించబడింది, సామ్రాజ్యవాదులు సిరియా, ఇరాక్ మరికొన్ని ఇతరదేశాలపై జేయసలపెట్టిన సైనికదండయాత్ర ప్రమాదం తప్పించబడింది. ఆల్జీరియా వీరప్రజానీకం స్వాతంత్ర్యము కొరకూ, స్వేచ్ఛకొరకూ చేసే సాహసోపేతమైన పోరాటం సాగుతూనే వున్నది. కాంగో, లావోస్ దేశాల ప్రజలు మరింతదీక్షతో సామ్రాజ్యవాదుల దుర్మార్గపు చర్యలను ప్రతిఘటిస్తూనే వున్నారు. సామ్రాజ్యవాదులు ప్రారంభించే స్థానిక యుద్ధాలను ఎదుర్కొని పోరాడటమూ, అటువంటి యుద్ధాలకు ఆటపట్టులుగా వుండేవాటిని జయప్రదంగా రూపుమాపటమూ సాధ్యమని అనుభవం తెలియ చేస్తున్నది.

ప్రపంచ యుద్ధాన్ని ప్రారంభించటానికి సామ్రాజ్యవాద దురాక్రమణదారులు చేసేప్రయత్నాలను అదుపులో పెట్టగల్గేకాలం వచ్చింది. ప్రపంచ సోషలిస్టు శిబిరం అంతర్జాతీయ కార్మికవర్గం, జాతీయ విముక్తి వుద్యమం యుద్ధాన్ని వ్యతిరేకించే అన్నిదేశాలు అన్ని శాంతికాముక శక్తులు కలిసిచేసే సమిష్టి కృషిద్వారా ప్రపంచయుద్ధం నివారించబడగలదు.

రెండు వ్యవస్థలమధ్య జరిగే పోరాటంవల్ల - సోషలిజము, శాంతి, ప్రజాతంత్రశక్తులు, సామ్రాజ్యవాదం, అభివృద్ధి నిరోధకము, దురాక్రమణశక్తులకు వ్యతిరేకంగా జరిపేపోరాటంవల్ల సమకాలీన అంతర్జాతీయ పరిస్థితుల అభివృద్ధి నిర్ణయింపబడుచున్నది. ఈ పోరాటంలో సోషలిజం, శాంతి, ప్రజాతంత్ర శక్తుల ఆధిక్యత రోజు రోజుకూ మరింత ప్రస్ఫుటమౌతూవున్నవి.

చరిత్రలో మొట్టమొదటిసారిగా గొప్పవైనట్టి, నిర్మాణయుక్తమైనట్టి శక్తులు యుద్ధాన్ని ప్రతిఘటిస్తున్నవి. శాస్త్ర విజ్ఞానం, సాంకేతిక విద్యల నిర్ణయాత్మక విభాగాలలో ప్రపంచానికి నాయకత్వం వహిస్తున్న బలీయమైన సోవియటు యూనియన్; శాంతి సేవలో తమ గొప్ప భౌతిక, రాజకీయ శక్తి సంపదల నన్నిటనీ అర్పించిన మొత్తం

సోషలిస్టు శిబిరం; శాంతిని పరిరక్షించడంలో ప్రాణప్రదమైన ఆసక్తి కల్గిన ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాలలోని శాంతికాముక దేశాలు (వీటి సంఖ్య నానాటికీ పెరుగుతూ వున్నది); అంతర్జాతీయ కార్మికవర్గమూ, దాని సంస్థలూ, అన్నిటికన్న ముఖ్యంగా కమ్యూనిస్టు పార్టీలు; వలసదేశాల, పరాధీన దేశాల ప్రజల జాతీయ విముక్తి వుద్యమం: ప్రపంచ శాంతివుద్యమం; సామ్రాజ్యవాద యుద్ధనీతిలో భాగం కోరకుండా, శాంతియుతసహజీవనాన్ని కోరుతూవున్న తటస్థదేశాలు—ఇవి ఈగొప్ప సంఘటితశక్తులు. అభివృద్ధిపొందిన పెట్టుబడిదారీ దేశాల బూర్జువావర్గంలోని కొన్ని ఖచ్చితమైన సెక్షన్లుకూడా బలాబలాల సంబంధాలను గూర్చి, ఆధునిక యుద్ధంయొక్క ప్రమాదకర ఫలితాలను గూర్చి జాగ్రత్తతో కూడిన వైఖరిని తీసుకొంటూ శాంతియుత సహజీవన పాలసీని వాంఛించుచున్నవి. ప్రపంచశాంతిని కాపాడటానికిగాను శాంతిని బలపర్చేవారందరితోనూ అమెరికన్ సామ్రాజ్యవాద ప్రోత్సాహంక్రింద సాగే సామ్రాజ్యవాద దురాక్రమణ, యుద్ధపాలసీలకు వ్యతిరేకంగా పోరాడే వారితోనూ ఐక్య సంఘటనను సాధ్యమైనంత విస్తృత ప్రాతిపదికపై నిర్మించటం అత్యంతావసరం. శాంతిశక్తులందరియొక్క సమీకృత, తీవ్రచర్యలు శాంతిని కాపాడి, ఒక నూతన యుద్ధం రాకుండా నివారించగలవు.

ప్రపంచ వ్యాపితంగా జరగగల అణుయుద్ధ వినాశనాన్నుండి మానవజాతిని రక్షించటం కన్న ప్రజాతంత్రశక్తులకూ, శాంతి శక్తులకూ ముందున్న మరొక జరూరు సమస్య ఏదీ లేదు. ఆధునిక ఆయుధాల బ్రహ్మాండ వినాశనకర శక్తిమూలంగా యుద్ధాన్ని నివారించటానికే యుద్ధ వ్యతిరేకశక్తులూ, శాంతికాముకశక్తులూ ప్రధానంగా కృషిజేయాలి. యుద్ధం ప్రారంభమయ్యేదాకా యుద్ధ వ్యతిరేక పోరాటాన్ని వాయిదా వేయలేవు; ఎందువల్లనంటే, అది ప్రారంభమైన తర్వాత దాని నెదుర్కొని పోరాడటానికి ప్రపంచంలోని అనేక ప్రాంతాలకూ, అందలి ప్రజలకూ అవకాశమే వుండదు.

అటంబాంబులూ, హైడ్రొజన్ బాంబులూ పడటం మొదలెట్టిన తర్వాత గాదు; ఇప్పుడే నూతన యుద్ధప్రమాదానికి వ్యతిరేకంగా పోరాటాన్ని సాగించాలి: ఈ పోరాటం రోజురోజుకూ బలాన్ని సంపాదించాలి. అసలు విషయమేమిటంటే సమయం వుండగానే దురాక్రమణదార్లను అదుపులో పెట్టాలి: యుద్ధం ప్రారంభంకాకుండా దానిని అటకాయించాలి.

శాంతికొరకై ఈ నాడు పోరాడటమంటే అత్యధికమైన జాగరూకతను కల్గివుండటం, సామ్రాజ్యవాదుల పాలసీని నిరవధికంగా బట్టబయలుచేయటం, యుద్ధకాముకుల కుట్రలనూ, పన్నుగడలనూ ఒకకంట కనిపెడుతూ వుండటం, యుద్ధోన్మాదులకు వ్యతిరేకంగా ప్రజల న్యాయమైన క్రోధాన్ని రగల్చటం, మరింత చక్కగా శాంతిశక్తులను సంఘటితపర్చడం, శాంతికొరకై ప్రజాబాహుళ్యపు కృషిని సదా తీవ్రంచేస్తూ వుండడం, నూతన యుద్ధాలలో ఆసక్తిలేని అన్నిదేశాలమధ్య సహకారాన్ని వృద్ధిచేయడం సామ్రాజ్యవాదులు యుద్ధస్థావరాలను నిర్మించుకొన్న దేశాలలో, ఆ స్థావరాల నెత్తివేయటానికి పోరాటాన్ని వృద్ధిచేయడం అవసరం; జాతీయ స్వాతంత్ర్యాన్ని దృఢపర్చుకొంటానికీ, దేశసార్వభౌమత్వాన్ని రక్షించుకొంటానికీ, యుద్ధాన్ని నివారించటానికి ఈ పోరాటం ఒక ముఖ్యమైన విషయంగా వుంటుంది. తమ దేశాలను సైనికతత్వమయం చేయటానికి వ్యతిరేకంగా సాగించే పోరాటాన్ని, అమెరికన్ సామ్రాజ్యవాదులతో సంబంధాలు కల్గివున్న పెట్టుబడిదారీ గుత్త సంస్థలకు వ్యతిరేకంగా జరిపే పోరాటాలతో ప్రజానీకం జోడించాలి. అన్ని దేశాలలో శాంతివుద్యమం పెంపొంది, బస్తీలకూ, పల్లెలకూ, ఫ్యాక్టరీలకూ, ఆఫీసులకూ వ్యాపించేలా పట్టుదలతో పోరాడటం ప్రధాన కర్తవ్యం.

ఈకాలంలో అత్యంత విస్తృతమైనది శాంతి వుద్యమం; కొత్త యుద్ధాలు రాకుండా ఆపటం, దీర్ఘ కాలశాంతిని సాధించటం అనే మహోన్నత ఆశయాలవల్ల ఐక్యంజేయబడ్డ వివిధ రాజకీయ, మత సిద్ధాంతాలకు చెందిన ప్రజలూ, సమాజంలోని వివిధ వర్గాలకు చెందిన ప్రజలూ జేరే వుద్యమం ఇది.

చాలాకాలం నిలబడివుండే శాంతిని కాపాడటానికి ప్రపంచ సోషలిస్టువ్యవస్థను మరింత సుదృఢంచేయటం ప్రప్రధానం. ఎంతకాల మైతే నిరాయుధీకరణ జరగదో అంతకాలమూ సోషలిస్టుదేశాలు తమ ఆత్మరక్షణ బలాన్ని తగిన స్థాయిలో వుంచాలి.

శాంతిని పరిరక్షించాలంటే, కమ్యూనిస్టుల ఉద్దేశంలో, మొట్ట మొదటుగా నిర్వహించవలసిన కర్తవ్యాలు: ఆయుధపోటీని ఆపడం; అణుఆయుధాలను నిషేధించటం, వాటి పరీక్షలనూ, ఉత్పత్తినీ నిషేధించటం, ఇతర దేశాలలో వున్న విదేశీ యుద్ధస్థావరాలను ఎత్తివేసి, ఆ దేశాలనుండి విదేశీసైన్యాలను వుపసంహరించడం, పశ్చిమ బెర్లినును నిరాయుధమొనర్చబడిన స్వేచ్ఛా పట్టణంగా మారిందించడం, పగదీర్చ వాంఛించే పశ్చిమజర్మను యుద్ధో న్మాదుల దురాక్రమణ పన్నాగాలను అరికట్టడం, జపాను సైనిక తత్వానికి పునఃప్రాణప్రతిష్ఠను ఆటంకపర్చడం.

ఒక క్రొత్త ప్రపంచయుద్ధం రాకుండా నెట్టివేసే మహత్తర బాధ్యతను చరిత్ర ప్రప్రథానంగా, ముఖ్యంగా అంతర్జాతీయ కార్మిక వర్గంపై వుంచింది. అణుయుద్ధాన్ని సాగిస్తానికి సామ్రాజ్యవాదులు కుట్రలుపన్నుతూ తమ శక్తులను ఐక్యంజేస్తూవుంటారు. నూతన ప్రపంచ యుద్ధవినాశనంనుండి మానవజాతిని సంరక్షించాలంటే అంతర్జాతీయ కార్మికవర్గం తన శ్రేణులను ఐక్యంజేసుకోవాలి. యుద్ధప్రమాదమునకు వ్యతిరేకంగా ఐక్యం కావడంలో ఏలాంటి రాజకీయ, మతభేదాలు గాని ఇతరభేదాలుగాని కార్మికవర్గ శక్తులకు అడ్డురాకూడదు. ప్రపంచశ్రామికవర్గం యొక్క అన్నిదళాలూ, అన్నిసంస్థలూ తమ బలీయమైన సంకల్పశక్తి ద్వారానూ ఐక్యకార్యాచరణద్వారానూ యుద్ధశక్తులను ఎదుర్కొనవలసినట్టి సమయం యేతెంచింది. ప్రపంచ యుద్ధాన్ని నివారించి, శాంతిని కాపాడ టానికిగాను తన శక్తుల నన్నింటినీ ఐక్యపర్చవలసిన తరుణం వచ్చింది.

శాంతిపోరాటం తమ మిక్కిలి ముఖ్యమైన కర్తవ్యంగా కమ్యూ నిస్టు పార్టీలు గుర్తించాలి. వారివారి రాజకీయ, మత నమ్మకాలతో నిమిత్తంలేకుండా కార్మికవర్గమూ, ట్రేడ్‌యూనియన్లూ, సహకార

సంస్థలూ, యువజన, మహిళా సంఘాలూ, సంస్థలూ మొత్తం శ్రామిక ప్రజలూ, ప్రజాబాహుళ్యపు పోరాటాలద్వారా సామ్రాజ్యవాదులు సాగించే అన్ని దురాక్రమణ చర్యలనూ గట్టిగా త్రిప్పి కొట్టవలసినదిగా కమ్యూనిస్టు పార్టీలు పిలుపివ్వాలి.

అయినప్పటికీ సామ్రాజ్యవాద ఉన్మాదులు యుద్ధమునే గనుక ప్రారంభిస్తే, ప్రజలు పెట్టుబడిదారీ విధానాన్ని తుదముట్టించి, దానిని భూస్థాపితం చేస్తారు.

సోషలిస్టుదేశాల పరదేశాంగ విధానం, సోషలిస్టు – పెట్టుబడిదారీదేశాల మధ్య శాంతియుత సహజీవనం, ఆర్థికపోటీ అనే లెనినిస్టుసూత్రపు దృఢమైన పునాదిపై ఆధారపడి వుంటుంది. శాంతి కాలంలో ఆర్థికరంగం, సాంస్కృతికరంగం, శాస్త్రవిజ్ఞానం, టెక్నాలజీ రంగాలలో పెట్టుబడిదారీ విధానంకంటే సోషలిస్టు విధానం మిన్నయైనదని అంతకంతకూ రుజువు అవుతూవుంటుంది. అద్యతనభావిలో శాంతి – సోషలిజం శక్తులకు నూతన విజయాలు చేకూరుతవి. ప్రపంచంలోకెల్లా ప్రధాన పారిశ్రామికశక్తిగా సోవియటు యూనియన్ తయారౌతుంది. చైనా బ్రహ్మాండమైన పారిశ్రామికదేశంగా తయారౌతుంది. ప్రపంచ పారిశ్రామికోత్పత్తిలో సగంకంటే అధికంగానే సోషలిస్టు వ్యవస్థలో వుత్పత్తి జరుగుతూవుంటుంది. శాంతిమండలం విస్తరిస్తుంది. పెట్టుబడిదారీ దేశాలలో కార్మికోద్యమం, వలసదేశాలు,పరాధీన దేశాలలో జాతీయవిముక్తి వుద్యమం నూతన విజయాలను సాధించుతాయి. వలస దోపిడీ వ్యవస్థ శిథిలం కావటం పూర్తి అవుతుంది. సోషలిజము శాంతిశక్తుల ఆధిక్యత అఖండమౌతుంది. ఇటువంటి పరిస్థితులలో, ప్రపంచములో ఇంకా సోషలిజం సంపూర్ణ విజయం పొందకముందే, ప్రపంచంలో ఒకభాగంలో పెట్టుబడిదారీ విధానం ఇంకా కొనసాగుతూ వుండగానే, సమాజ జీవితంనుండి యుద్ధాన్ని బహిష్కరించే వాస్తవమైనఅవకాశం ఉద్భవిస్తుంది. ప్రపంచమంతా సోషలిజం విజయం పొందినప్పుడు అన్ని యుద్ధాలకూ మూలంగావుండే సాంఘిక, జాతీయ కారణాలు సంపూర్ణంగా తొలగించబడతాయి.

ప్రపంచమందలి కమ్యూనిస్టులందరూ ఏకగ్రీవంగానూ, నిలకడగానూ శాంతియుత సహజీవనాన్ని చేబట్టి యుద్ధ నివారణకు దీక్షతో పోరాడతారు. ప్రపంచ యుద్ధాన్ని నివారించటానికిగల అవకాశాన్ని తక్కువ అంచనా వేయడాన్నీ. శాంతియుత సహజీవనం యొక్క అవకాశాన్ని తక్కువ అంచనా వేయటాన్ని నివారిస్తానికీ, కాని అదేసమయంలో యుద్ధప్రమాదాన్ని తక్కువ అంచనా వేయటాన్ని నివారిస్తానికి కమ్యూనిస్టులు ప్రజా సామాన్యంలో అవిరామమైన కృషిని సాగిస్తారు.

రెండువ్యవస్థల క్రింద ప్రపంచం చీలి వున్నప్పుడు వివిధ సామాజిక వ్యవస్థల క్రింద వుండే దేశాలమధ్య శాంతియుత సహజీవనం అవసరం అనే సిద్ధాంతము ఒక్కటే అంతర్జాతీయ సంబంధాలకు సంబంధించిన నిజమైన హేతుబద్ధమైనసిద్ధాంతం;ఈసిద్ధాంతాన్ని లెనిన్ ప్రతిపాదించాడు. 1957 ప్రకటనలోనూ, శాంతి మానిఫెస్టోలోనూ, సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ 20, 21 వ కాంగ్రెసుల నిర్ణయాలలోనూ, ఇతర కమ్యూనిస్టు, కార్మిక పార్టీల డాక్యుమెంట్లలోనూ ఇది మరింత వివరించబడింది.

చైనా ప్రజా రిపబ్లికు, భారతదేశ రిపబ్లికూ సంయుక్తంగా ప్రతిపాదించిన పంచశీల సూత్రాలూ, బాండుంగు మహాసభలో అంగీకరింపబడిన ప్రతిపాదనలూ, శాంతిప్రయోజనాలకూ, శాంతి కాముక ప్రజల ప్రయోజనాలకూ అనుగుణ్యంగా వున్నవి.

వివిధ వ్యవస్థలుగల దేశాల మధ్య శాంతియుత సహజీవనమా లేక వినాశనకర యుద్ధమా, ఏది అన్నదే నేటి ప్రత్యామ్నాయం; మరొక మార్గంలేనేలేదు. "ప్రచ్ఛన్న యుద్ధం", "యుద్ధ బెదిరింపు" అనే అమెరికన్ సిద్ధాంతాన్ని కమ్యూనిస్టులు ఖండితంగా నిరాకరిస్తారు; ఎందువల్లనంటే అది అణు యుద్ధప్రమాదానికి దారితీసే పాలసీ. శాంతియుత సహజీవనసూత్రానికి కట్టుబడివుంటూ, కమ్యూనిస్టులు ప్రచ్ఛన్న యుద్ధం సంపూర్ణంగా విసర్జించబడటానికీ, సైనిక కూటముల రద్దుకూ, సైనిక స్థావరాల నిర్మూలనకూ, అంతర్జాతీయ కంట్రోలుక్రింద సంపూర్ణ నిరాయుధీకరణను సాధించుటకూ,

సంప్రతింపులద్వారా అంతర్జాతీయ వివాదాలను పరిష్కరించుకొను టకూ, దేశాల మధ్య సమానత్వమునూ, వాటిప్రాదేశిక సమైక్యతనూ, స్వాతంత్ర్యాన్నీ, సార్వభౌమత్వాన్నీ గౌరవించుటకూ, ఒకరి అంత రంగిక వ్యవహారాలలో మరొకరు జోక్యంకల్గజేసుకొనకుండా వుండటానికీ, వివిధ దేశాలమధ్య వర్తక వ్యాపారాన్నీ, సాంస్కృతిక, శాస్త్ర విజ్ఞాన సంబంధాలనూ విస్తారంగా అభివృద్ధి చేస్తానికీ పోరాడు తారు.

దుర్మార్గపు యుద్ధాలను కోరనటువంటీ, చిరకాలం నిల్చివుండే శాంతిని కోరేటటువంటీ మొత్తం ప్రజలందరియొక్క మూలప్రయోజనా లకు శాంతియుత సహజీవనసూత్రం అనుగుణ్యంగా వుంటుంది. ఈ పాలసీ సోషలిజం స్థానాల బలాన్ని పెంచుతుంది; సోషలిస్టుదేశాల అంతర్జాతీయ పలుకుబడినీ, ఖ్యాతినీ వృద్ధిచేస్తుంది; పెట్టుబడిదారీ దేశాలలోని కమ్యూనిస్టుపార్టీలఖ్యాతినీ పలుకుబడినీ, పెంపొందిస్తుంది. సోషలిజానికి శాంతి, నమ్మకమైన మిత్రము; ఎందువల్లనంటే, పెట్టు బడిదారీ విధానానికి వ్యతిరేకంగా, సోషలిజానికి అనుకూలంగా కాలం మారుతోంది.

శాంతియుత సహజీవన సిద్ధాంతం జాతి శత్రువులకు వ్యతిరే కంగా ప్రజాబాహుళ్యాన్ని సమీకరించే పాలసీ. వారికి వ్యతిరే కంగా శక్తివంతమైన చర్యలను చేబట్టే పాలసీ. మార్క్సిస్టు వక్ర భాష్యకారులు చెప్పునట్లుగా, దేశాలమధ్య శాంతియుత సహజీవనం అంటే వర్గపోరాటాన్ని విసర్జించటంకాదు. వివిధసామాజిక వ్యవస్థలుగల దేశాలమధ్య సహజీవనంఅనేది సోషలిజమూ పెట్టుబడిదారీ విధానముల మధ్యజరిగే వర్గపోరాటంయొక్క ఒక రూపం. శాంతియుత సహజీవన పరి స్థితులలో, పెట్టుబడిదారీ దేశాలలో వర్గపోరాటాన్ని అభివృద్ధిచేస్తానికీ, వలస పరాధీనదేశాల ప్రజల జాతీయ విముక్తి పోరాటాన్ని అభివృద్ధి చేస్తానికీ అనుకూలావకాశాలు ఏర్పడుతాయి. తమ వంతుగా, విప్లవ వర్గపోరాటం, జాతీయవిముక్తి పోరాటం విజయాలు శాంతియుత సహజీవనాన్ని పెంపొందిస్తాయి. శాంతియుత సహజీవనం మరింత పెంపొందే అవకాశాలలో ప్రజలకు గల విశ్వాసాన్నీ, ప్రపంచ

యుద్ధాన్ని నివారించటానికి వారికిగల దృఢనిశ్చయాన్ని మరింత గట్టిపర్చడం కమ్యూనిస్టులు తమ విధ్యుక్త ధర్మంగా భావిస్తారు. శాంతి, ప్రజాతంత్రం, జాతీయ విముక్తుల కొరకు చురుకైన పోరాటాన్ని సాగించడం ద్వారా సామ్రాజ్యవాదాన్ని బలహీనపర్చేందుకూ, దాని కార్యరంగాన్ని సంకుచితం చేసేందుకూ ప్రజలకు వారు శాయశక్తులా సహాయం జేస్తారు.

వేర్వేరు సామాజిక వ్యవస్థలున్న దేశాలమధ్య శాంతియుత సహజీవనం వుండటమంటే సోషలిస్టు, బూర్జువా తాత్విక సిద్ధాంతాల మధ్య సమాధానంకుదిర్చటంకాదు. అందుకు భిన్నంగా, సోషలిస్టుభావాల విజయంకొరకు కార్మికవర్గాలూ, కమ్యూనిస్టు పార్టీలూ గావించే పోరాటం తీవ్రతరం కావటమన్నమాట. కాని దేశాలమధ్య వుండే సిద్ధాంత, రాజకీయ వివాదాలను యుద్ధంద్వారా పరిష్కరించబూనడం కూడదు.

**సంపూర్ణమైన జనరల్ నిరాయుధీకరణకు సోవియట్ యూనియన్ ప్రతిపాదించిన కార్యక్రమాన్ని అమలుజరపడం మానవజాతి భవిష్యత్తుకు చారిత్రాత్మక ప్రాముఖ్యతగలదిగా వుండగలదని ఈ సమావేశం భావిస్తున్నది. ఈ కార్యక్రమాన్ని సాధించడమంటే దేశాలమధ్య యుద్ధాలను సాగించటానికి గల అవకాశాన్నే అంతమొందించటమన్నమాట. సామ్రాజ్యవాదుల మొండి ప్రతిఘటనమూలకంగా దీనిని సాధించటం తేలికైన విషయంకాదు. కాబట్టి,ఈకార్యక్రమాన్ని ఆచరణలోకి తెచ్చే ఆశయంతో సామ్రాజ్యవాద దురాక్రమణశక్తులకు వ్యతిరేకంగా చురుకైన పట్టుదలతోకూడిన పోరాటాన్ని సాగించడం అత్యంతావశ్యకం. అంతకంతకూ హెచ్చు ప్రమాణంలో ఈపోరాటాన్ని సాగించుతూ నిర్దిష్టమైన ఫలితాలను, అనగా అణుఆయుధాల పరీక్షలనూ, వుత్పత్తినీ నిషేధించటం, సైనిక కూటములను రద్దుచేయటం, ఇతరదేశాల భూభాగంలో నెలకొల్పిన సైనిక స్థావరాలను రద్దుచేయటం, సైన్యాలలోనూ, ఆయుధాలలోనూ తగినంత తగ్గింపును చేయటంలాంటివాటిని సాధించటానికి నిర్విరామంగా కృషిచేయడం అవసరం. ఇవన్నీ జనరల్ నిరాయుధీకరణకు బాట నేర్పరుస్తాయి. సోషలిస్టు దేశాలూ,**

ఇతర శాంతికాముక దేశాలూ, అంతర్జాతీయ కార్మికవర్గమూ, అన్ని దేశాలలోని విస్తారప్రజాబాహుళ్యమూ చురుకుగానూ, పట్టు దలగానూ జరిపే పోరాటంద్వారా దురాక్రమణ తత్వపుముఠాలను దూరంచేయడం, ఆయుధ పోటీనీ, యుద్ధసన్నాహాలనూ భగ్నం చేయడం సాధ్యమౌతుంది; జనరల్ నిరాయుధీకరణకు సామ్రాజ్య వాదులంగీకరించేటట్లు నిర్బంధించ సాధ్యమౌతుంది.

యుద్ధాన్నిఆపగలేది ఆయుధపోటీయే అనడం తప్పు. అది ప్రజలకు హెచ్చైన ఉద్యోగవసతులనూ, సుఖప్రదజీవితాన్ని కల్గించేదీకాదు. అది యుద్ధానికే దారితీస్తుంది. కేవలం కొలదిమందిగావున్న గుత్తాధిపతులు యుద్ధలాభాల కాశపడే చట్టావ్యాపారస్థులుమాత్రమే ఆయుధ పోటీలో ఆసక్తిని గల్గి వున్నారు. పెట్టుబడిదారీ దేశాలలో ప్రజలు, సైనిక ఖర్చులను తగ్గించాలనీ, ఆవిధంగా లభ్యమైన ధనాన్ని ప్రజల జీవన ప్రమాణాలను అభివృద్ధిచేస్తానికి వినియోగించాలనీ సదా కోరుతూవుంటారు. నిరాయుధీకరణ ద్వారా లభ్యంకాగల ధనాన్ని, సంపదలనూ, గృహనిర్మాణం, ఆరోగ్యవసతులు, పబ్లిక్ విద్య, సాంఘిక భద్రత, శాస్త్రవిజ్ఞాన పరిశోధన, ప్రజావసరాల ఉత్పత్తి మున్నగు వాటికి వినియోగించాలని ఒక విస్తృతమైన ప్రజా బాహుళ్యపు వుద్యమాన్ని పెంపొందించడం ప్రతి దేశంలోనూ అవసరం. నిరాయుధీకరణ నేడు ప్రజాసామాన్యంయొక్క పోరాట నినాదంగా, తక్షణ చారిత్రకావసరంగా తయారైనది. చురుకైన, దృఢమైన పోరాటంద్వారా ఈ ప్రజావాంఛకు సామ్రాజ్యవాదులు లొంగునట్లుగా చేసితీరాలి.

వేర్వేరు సామాజికవ్యవస్థలకు చెందిన దేశాలతో, సోషలిస్టు దేశాలు, కమ్యూనిస్టు, కార్మికపార్టీలు శాంతియుత సహజీవన పాలసీని అవలంబించడం ఖచ్చితంగా అనుసరిస్తూ, నూతన యుద్ధంయొక్క బీభత్సాలు, వినాశనములనుండి ప్రజలను తప్పిస్తానికిగాను తమ శక్తి కొలదీ చేయవలసినదంతా చేస్తారు. వారు సామ్రాజ్యవాదాన్ని అత్యధికమైన జాగరూకతతో కనిపెట్టివుంటూ మొత్తం సోషలిస్టు శిబిరంయొక్క శక్తినీ, ఆత్మరక్షణ సామర్థ్యాన్ని శక్తివంతంగా

బలోపేతం జేస్తూ వుంటారు; వివిధ దేశాల ప్రజల భద్రతను కాపాడ టానికి శాంతిని పరిరక్షించడానికి అన్ని చర్యలనూ తీసుకొంటూ వుంటారు.

ప్రపంచమంతటా దోపిడీని, దారిద్ర్యాన్నీ నిర్మూలించటమూ, మానవ సమాజ జీవితకాలంలో ఏలాంటి యుద్ధానికీ అవకాశం లేకుండా శాశ్వతంగా బహిష్కరించటమూ అనేవే గాక, కమ్యూనిస్టులు మన కాలంలోనే, మానవజాతిని నూతన యుద్ధ భయ పిశాచంనుండి తప్పించటం అనేదికూడా తమ చారిత్రక కర్తవ్యంగా భావించుతారు. ఈ మహత్తర చారిత్రక కర్తవ్యాన్ని నిర్వహించటానికి కమ్యూనిస్టుపార్టీలు తమ బలాన్నీ, శక్తినీ అంతటినీ ధారపోస్తాయి.

# 4

# జాతీయ విముక్తి ఉద్యమాల మహత్తర విజయం

జాతీయ విముక్తి విప్లవాలు ప్రపంచంలో విశాలప్రాంతాల్లో విజయాలు పొందాయి. యుద్ధానంతరం 15 సంవత్సరాల్లోనూ ఆసియాలోనూ, ఆఫ్రికాలోనూ, కొత్తగా 40 వరకూ సర్వంసహాధికారంగల రాజ్యాలు అవతరించాయి. క్యూబా విప్లవవిజయం, లాటిన్ అమెరికా దేశాల సంపూర్ణ స్వాతంత్ర్యపోరాటానికి గొప్ప ప్రోత్సాహమిచ్చింది. మానవాళి జీవితంలో ఒక కొత్త చారిత్రక కాలం ఉద్భవించింది. స్వాతంత్ర్యం పొందిన ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా దేశాల ప్రజలు ప్రపంచ రాజకీయాల్లో బాగా పాల్గొంటున్నారు.

వలస రాజ్య విధానం అనతికాలంలోనే పూర్తిగా పతనమవక తప్పదు. జాతీయ విముక్తి ఉద్యమ ప్రభావంక్రింద వలసరాజ్య బానిస విధానం బ్రద్దలవడమనే దానికి ఎంతో చరిత్రాత్మక ప్రాముఖ్యత ఉన్నది. చారిత్రక ప్రాముఖ్యతలో సోషలిస్టు ప్రపంచ వ్యవస్థ తర్వాత ఇది రెండవ స్థానం అందుకుంటుంది.

మహత్తరమైన అక్టోబరు సోషలిస్టు విప్లవం ప్రాగ్దిశను మేల్కొలిపింది. ప్రపంచ వ్యాపిత విప్లవోద్యమ ప్రవాహంలోకి వలస దేశాల ప్రజానీకాన్ని ఆకర్షించింది. రెండవ ప్రపంచ యుద్ధంలో సోవియట్ యూనియన్ విజయం పొందడంవల్ల, కొన్ని ఆసియా, ఐరోపా దేశాలు నూతన ప్రజాస్వామిక రాజ్యాలుగా నెలకొనడం వల్ల, చైనాలో సోషలిస్టు విప్లవం విజయం పొందడంవల్ల, సోషలిస్టు ప్రపంచ వ్యవస్థ ఏర్పడటంవల్ల ఈ పరిణామానికి పెద్ద అవకాశం కలిగింది. వలస దేశాల, పరాధీన దేశాల ప్రజలు సామ్రాజ్యవాద బానిసత్వంనుండి విముక్తి చెందడంలో ప్రపంచ సోషలిస్టు శక్తులు నిర్ణాయకంగా తోడ్పడ్డాయి. స్వాతంత్ర్యం పొందిన దేశాల స్వతంత్ర జాతీయాభివృద్ధికి సోషలిస్టు వ్యవస్థ నమ్మకమైన రక్షణ కలిగించింది. జాతీయ విముక్తి ఉద్యమాలకు అంతర్జాతీయ కార్మికోద్యమపు శక్తివంతమైన అండదండలు చేకూరాయి.

ఆసియా రూపురేఖలు మారాయి. ఆఫ్రికాలో వలసరాజ్యాధిపత్యం బ్రద్దలవుతోంది. లాటిన్ అమెరికాలో సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ప్రత్యక్షపోరాటరంగం ప్రారంభమైంది. ఆసియా, ఆఫ్రికాల్లోనూ, ఇతర ప్రాంతాల్లోనూ కోటానుకోట్ల ప్రజలు సామ్రాజ్యవాదంతో తీవ్రంగాపోరాడి స్వాతంత్ర్యాలు పొందారు. జాతీయవిముక్తి యుద్ధాలకుగల అభ్యుదయ, విప్లవ ప్రాముఖ్యాన్ని కమ్యూనిస్టులు ఎల్లవుడూ గుర్తించారు. జాతీయ స్వాతంత్ర్యోద్యమాల్లో వారు అగ్రగాములుగా వున్నారు. ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ ఏర్పడటం వలన, సామ్రాజ్యవాదులు బలహీనపడటంవలన బానిస దేశాల ప్రజలు స్వాతంత్ర్యాలు పొందేందుకు కొత్త అవకాశాలు కలిగాయి.

వలస దేశాల్లోని ప్రజలు ఆయా దేశాల్లోని ప్రత్యేక పరిస్థితుల నాధారం చేసుకొని, అటు సాయుధ పోరాటాలద్వారాగాని, ఇటు సైనికేతర పద్ధతులతో గాని స్వాతంత్ర్యాలు సాధిస్తారు. శక్తివంతమైన జాతీయ విముక్తి ఉద్యమంద్వారా వారు నికరమైన విజయాన్ని పొందుతారు. వలసదేశాల ప్రజలకు, వలస రాజ్యాలు స్వాతంత్ర్యాన్ని ఎప్పుడూ ప్రసాదించవు. తాము దోచుకుంటున్న దేశాలను తామే ఐచ్ఛికంగా వదలిపోవు.

నేడు వలసాధిపత్యానికి అమెరికా ప్రధానమైన ప్రాపుగావుంది. ఇంతకుముందు తమ క్రిందనున్న వలసదేశాల్లో వలసదోపిడీని కొత్త కొత్త రూపాల్లోనూ, పద్ధతుల్లోనూ కొనసాగించేందుకు అమెరికా నాయకత్వాన సామ్రాజ్యవాదులు ప్రయత్నిస్తున్నారు. ఆసియాలోనూ, ఆఫ్రికాలోనూ, లాటిన్ అమెరికాలోనూ తమ ఆర్థిక పెత్తనాన్నీ,రాజకీయ పలుకుబడినీ కొనసాగించడానికిఉపకరించేకీలకాలను తమ చేతుల్లోనే నిలుపుకునేందుకు గుత్తవ్యాపార సంస్థలు ప్రయత్నిస్తున్నాయి. స్వాతంత్ర్యంపొందిన దేశాల్లో తమ ఆర్థిక పట్టును నిలుపుకునేందుకు, ఆర్థిక "సహాయం" ముసుగుతో కొత్త స్థానాలను పట్టుకునేందుకు, ఆ దేశాలను సైనిక కూటాలలోకి లాగి, అక్కడ సైనిక నియంతృత్వాలను నెలకొల్పి యుద్ధశిబిరాలను స్థాపించుకునేందుకు యీ ప్రయత్నాలు సాగుతున్నాయి. కొత్తగా స్వాతంత్ర్యం పొందిన దేశాల సర్వంసహాధికారాన్ని దెబ్బతీసి, నిరర్థకంచేసి, జాతుల స్వయంనిర్ణయ సూత్రానికి అపార్థాలుచెప్పి, "పరస్పరాధారం" అనే దొంగచాటు నినాదంక్రింద కొత్తరూపంలో వలస పెత్తనాన్ని రుద్దేందుకు, బూర్జువావర్గంలో ఒక తరగతికి లంచమిచ్చేందుకూ, ఆ దేశాల్లో తమ కీలుబొమ్మలను అధికారంలోకి తెచ్చేందుకూ సామ్రాజ్యవాదులు ప్రయత్నిస్తున్నారు. అంతఃకలహమనే విషపూరితమైన ఆయుధాన్ని ప్రయోగించి ఇంకా బలపడని కొత్తరాజ్యాలను దెబ్బతీసేందుకు పూనుకుంటున్నారు. అందుకు దురాక్రమణ సైనిక కూటాలనూ, విడివిడిగా ఏర్పరచుకున్న సైనిక, దురాక్రమణ ఒప్పందాలనూ విరివిగా ఉపయోగించుకుంటున్నారు. సామ్రాజ్యవాదులకు

తాబేదారులుగా వున్నవారు, స్థానిక దోపిడీ వర్గాలలోకల్లా అత్యంత అభివృద్ధినిరోధకులుగా వున్నారు.

ఒకేజాతీయ ప్రజాతంత్ర సంఘటనలో దేశంలోగల దేశభక్తియుతశక్తులన్నీ ఐక్యమై, సామ్రాజ్యవాదానికీ, ఫ్యూడల్ అవశేషాలకూ వ్యతిరేకంగా దృఢమైనపోరాటంచేయకపోతే, వలసపీడవదిలించుకున్న దేశాలు తమ ఎదుర్కొన్న సత్వరజాతీయ పునరుజ్జీవన కర్తవ్యాలను పటిష్ఠంగా నిర్వహించజాలవు. స్వాతంత్ర్యం పొందిన దేశాలలో అభ్యుదయ శక్తులు ఐక్య మయ్యేటటువంటి, ఐక్యం కాగలిగినటువంటి జాతీయ ప్రజాస్వామిక కర్తవ్యాలు దిగువవిధంగా వుంటాయి: రాజకీయస్వాతంత్ర్యాన్ని గట్టిపరచుకోవడం; రైతాంగ ప్రయోజనంకోసం వ్యవసాయ సంస్కరణలను అమలు జరపడం; ఫ్యూడల్ అవశేషాలను తొలగించడం; సామ్రాజ్యవాద ఆర్థిక పెత్తనాన్ని ఉదమట్టించడం; విదేశీ గుత్త ఆధిపత్యాన్ని పరిమితిలోపెట్టి జాతీయ ఆర్థిక విధానంనుండి దాన్ని తొలగించడం; జాతీయ పరిశ్రమలను ఏర్పరచుకొని పెంపొందించటం; జీవన స్థాయి పరిమాణాన్ని పెంచడం; సాంఘిక జీవితంలో ప్రజాస్వామ్యాన్ని నెలకొల్పడం; స్వతంత్ర, శాంతియుత విదేశాంగ విధానాన్ని అనుసరించడం, సోషలిస్టు రాజ్యాలతోనూ, ఇతర మిత్రరాజ్యాలతోనూ ఆర్థిక సాంస్కృతిక సహకారాన్ని పెంపొందించుకోవడం.

జాతీయవిముక్తి పోరాటంలో గణనీయమైన పాత్రను నిర్వహించిన కార్మికవర్గం, సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజాతంత్ర విప్లవ జాతీయ కర్తవ్యాలను నికరంగా పూర్తి చేయాలని కోరుతుంది. సాంఘికాభివృద్ధిని అరికట్టే అభివృద్ధినిరోధక ప్రయత్నాలను ప్రతిఘటిస్తుంది.

అధిక సంఖ్యాక ప్రజానీకపు ప్రత్యక్ష ప్రయోజనాలకు సంబంధించిన రైతాంగ సమస్యను పరిష్కరించడం యీ దేశాలకు అత్యంత ముఖ్యమైన సమస్య. తీవ్రమైన వ్యవసాయ సంస్కరణలు లేకుండా, ఆహారసమస్యను పరిష్కరించడం అసాధ్యం; వ్యవసాయంలోనూ పరిశ్రమలలోనూ ఉత్పత్తి శక్తుల అభివృద్ధికి ఆటంకంగావున్న

పురాతన అవశేషాలను తుదముట్టించడమూ అసాధ్యం. జాతీయ ఆర్థికరంగంలో ప్రత్యేకంగా పరిశ్రమల్లో ప్రభుత్వరంగాన్ని ఏర్పరచి, విస్తృతపరచడం యీ దేశాలకు ఎంతో ముఖ్యం. ఆ రంగం విదేశ గుత్తాధిపత్యానికి దూరంగావుండి, క్రమేణా దేశ ఆర్థికవిధానంలో నిర్ణాయకశక్తిగా తయారుగావాలి.

జాతీయ స్వాతంత్ర్యాన్ని సంపాదించి సంరక్షించడంలో, అత్యధిక ప్రభావంగల ప్రజాస్వామిక మార్పులను సాధించటంలో, సాంఘికాభ్యుదయాన్ని పొందడంలో కార్మిక కర్షక మైత్రి చాలా ముఖ్యమైన శక్తిగా వుంటుంది. విశాల జాతీయ సంఘటనకు యీ మైత్రి పునాదిగా వుంటుంది. విముక్తి పోరాటంలో జాతీయ బూర్జువావర్గం ఏ మేరకు పాల్గొనేదీ కూడా యీ మైత్రియొక్క బలం మీద, స్థిరత్వంమీద చాలా వరకు ఆధారపడి వుంటుంది. జాతీయ స్వాతంత్ర్యంకోసం, సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా పోరాడటంలో దేశభక్తియుత శక్తులన్నీ కలిసివస్తే గొప్పపాత్రను నిర్వహించవచ్చు.

ప్రస్తుత పరిస్థితుల్లో ముఖ్యమైన సామ్రాజ్యవాద వ్యతిరేక, ఫ్యూడల్ వ్యతిరేక విప్లవ కర్తవ్యాలు నెరవేరడం, వలస పరాధీన దేశాల్లో సామ్రాజ్యవాదవర్గాలతో సంబంధంలేకుండావున్న జాతీయ బూర్జువా వర్గానికి భౌతికంగా ప్రయోజనకరం. అందుకే యీ వర్గం సామ్రాజ్యవాదానికీ, ఫ్యూడలిజానికీ వ్యతిరేకంగా విప్లవపోరాటంలో పాల్గొనగలదు. ఆ దృష్ట్యా అది అభ్యుదయకామి. కాని దానికి స్థిరత్వం లేదు. అభ్యుదయకామిఅయినా, సామ్రాజ్యవాదంతోనూ, ఫ్యూడలిజం తోనూ రాజీపడేందుకు అదిమొగ్గుతుంది. ఈ ద్వంద్వ స్వభావంవల్ల ఏ మేరకు విప్లవంలో జాతీయబూర్జువావర్గం పాల్గొనేదీ దేశదేశానికీ మారుతూంటుంది. అక్కడున్న నిర్దిష్టపరిస్థితులమీద, వర్గశక్తుల సంబంధాలలో కలిగిన మార్పులమీద, అటు సామ్రాజ్యవాదానికీ, ఫ్యూడలిజానికి ఇటు ప్రజలకూ మధ్య వైరుధ్యం ఎంత ఎక్కువగా వున్నదో, అనేదానిమీద ఇటు బూర్జువా వర్గానికీ, అటు సామ్రాజ్యవాదానికీ, ఫ్యూడలిజానికీ మధ్య వైరుధ్యాలు ఎంతలోతుగా వున్నవన్నదానిమీద జాతీయ బూర్జువావర్గ పాత్ర ఆధారపడివుంటుంది.

రాజకీయ స్వాతంత్ర్యం పొందిన తర్వాత, తమ జీవితంలో ఉత్పన్నమైన సాంఘిక సమస్యలనూ, రాజకీయ స్వాతంత్ర్యాన్ని బలపరిచే సమస్యలనూ పరిష్కరించమని ప్రజలు కోరుతారు. విభిన్న వర్గాలూ, పార్టీలూ విభిన్న పరిష్కారమార్గాలు సూచిస్తాయి. ఏ పరిణామాభివృద్ధిని నిర్ణయించుకునేదీ ఆయా ప్రజల అంతర్గత వ్యవహారమే. సాంఘిక విరుద్ధ్యాలు పెంపొందినకొలదీ సామ్రాజ్యవాదంతోనూ, అంతర్గత అభివృద్ధి నిరోధకశక్తులతోనూ రాజీపడేందుకు జాతీయ బూర్జువా వర్గం ఎక్కువగా మొగ్గుతూంటుంది. ఏమైనా తమ దీర్ఘకాల వెనుకబాటుతనంపోయి తమ జీవిత స్థాయి పెంపొందాలంటే అందుకు పెట్టుబడిదారీ విధానేతర అభివృద్ధే అత్యుత్తమమైనదని ప్రజలు మాత్రం చూడనారంభిస్తారు. దోపిడి, పేదరికం ఆకలి బాధల నుండి ప్రజలు ఆ విధంగా మాత్రమే విముక్తి పొందుతారు. ప్రాధమికమైన యీ సాంఘిక సమస్యను పరిష్కరించడంలో కార్మికవర్గమూ, విశాల రైతాంగ ప్రజానీకమూ, నాయకత్వ పాత్రను నిర్వహిస్తాయి.

ప్రస్తుత పరిస్థితిలో స్వతంత్ర జాతీయ ప్రజాస్వామ్యాన్ని నెలకొల్పుకునేందుకు అనేక దేశాల్లో అంతర్గత, అంతర్జాతీయ పరిస్థితులు అనుకూలంగా ఉన్నాయి. అంటే రాజకీయ ఆర్థిక స్వాతంత్ర్యాన్ని నికరంగా నిలబెట్టుకొనే రాజ్యానికి, సామ్రాజ్యవాదానికి సైనిక కూటాలకూ వ్యతిరేకంగా పోరాడే రాజ్యానికి, తన దేశంలో సైనిక శిబిరాలకు అవకాశమివ్వని రాజ్యానికి, కొత్త రూపపు వలస ఆధిపత్యాన్నీ, సామ్రాజ్యవాద పెట్టుబడి ప్రవేశాన్నీ వ్యతిరేకిస్తూ పోరాడే రాజ్యానికి, నిరంకుశ పరిపాలనా పద్ధతులను తిరస్కరించే రాజ్యానికీ,విశాల ప్రజాస్వామిక హక్కులనూ, స్వేచ్ఛనూ (వాక్, పత్రికా, సమావేశ, ప్రదర్శనా స్వాతంత్ర్యాలనూ సాంఘిక రాజకీయ పార్టీ లేర్పరచుకునే హక్కులనూ) అంగీకరించే రాజ్యానికీ, వ్యవసాయ సంస్కరణలు తేవడానికీ, తదితర సాంఘిక ప్రజాతంత్ర మార్పులు చేయడానికీ, ప్రభుత్వ విధానాన్ని మార్చడానికీ పాల్గొని కృషిచేసేందుకు అవకాశమిచ్చే రాజ్యానికి అట్టి అనుకూల పరిస్థితులున్నాయి. ఈ విధంగా ఏర్పడి, సంఘటిత పడిన జాతీయ

ప్రజాస్వామ్యాలు ఆయా దేశాలు సత్వర సాంఘికాభివృద్ధి చెందేందుకూ, శాంతి పోరాటంలో ప్రజలు బాగా పాల్గొని తమ పాత్ర నిర్వహించేందుకూ, సామ్రాజ్యవాదశిబిర దురాక్రమణ విధానాలను వ్యతిరేకించేందుకూ, వలసబానిసత్వాన్ని పూర్తిగా తొలగించుకొనేందుకూ అవకాశమిస్తాయి.

సామ్రాజ్యవాద వ్యతిరేక, ఫ్యూడల్ వ్యతిరేక ప్రజాతంత్ర విప్లవ కర్తవ్యాలను నికరంగా పూర్తి చేసేందుకూ, జాతీయ ప్రజాస్వామ్యాలు నెలకొనేందుకూ, ప్రజల జీవనస్థాయిని బాగా పెంపొందించేందుకూ కమ్యూనిస్టుపార్టీలు తీవ్రంగా కృషి చేస్తున్నాయి. సామ్రాజ్యవాదులపట్టును సడలించి, సాధించిన విజయాలనుసంఘటితపరిచేందుకు జాతీయ ప్రభుత్వాలు తీసుకునే చర్యలను కమ్యూనిస్టుపార్టీలు బలపరుస్తాయి. అదే సమయంలో ఆ పాలకవర్గాలనుసరించే ప్రజాస్వామిక వ్యతిరేక, ప్రజా వ్యతిరేక చర్యలనూ, జాతీయ స్వాతంత్ర్యాలకు ప్రమాదంతెచ్చే చర్యలనూ ఆ పార్టీలు దృఢంగా వ్యతిరేకిస్తాయి. బూర్జువా వర్గంలో అభివృద్ధి నిరోధకతరగతి, తన సంకుచితస్వార్థ పర్గప్రయోజనాలనే యావజ్జాతీయ ప్రయోజనాలుగా ఎలా చిత్రిస్తుందో కమ్యూనిస్టులు వెల్లడిచేస్తారు. ఆ ప్రయోజనం కోసమే వాగాడంబరంగా బూర్జువా రాజకీయవేత్తలు సోషలిస్టు నినాదాలను కూడా ఎలా ఉపయోగించుకుంటారో కమ్యూనిస్టులు వెల్లడిస్తారు. సాంఘిక జీవితంలో నిజమైన ప్రజాస్వామ్యం ఏర్పడేందుకు వారు కృషిచేస్తారు. నిరంకుశ ప్రభుత్వాలను ఎదుర్కొనేందుకూ, అటువంటి ప్రభుత్వాలను ఏర్పరచడానికి జరిగే ప్రయత్నాలను అణచేందుకూ వారు అభివృద్ధికాముక శక్తులందర్నీ సమీకరిస్తారు.

జాతి మహోన్నత ప్రయోజనాలకు కమ్యూనిస్టుల ఆశయాలు అనుగుణమైనవి. విముక్తి ఉద్యమంలో ముందుశ్రేణిని నిలచిన కమ్యూనిస్టులను "కమ్యూనిస్టు వ్యతిరేక" నినాదంతో వేరుపరచి జాతీయసంఘటనను బ్రద్దలుగొట్టాలనే అభివృద్ధి నిరోధకుల ప్రయత్నం జాతీయోద్యమాన్ని బలహీనపరుస్తుంది. ప్రజల జాతీయ ప్రయోజ

నాలకు అది వ్యతిరేకం. సాధించిన జాతీయ విజయాలకు అది సృష్టి దాయకం.

విముక్తికై పోరాడుతున్న ప్రజలకు, సామ్రాజ్యవాద బానిసత్వాన్ని వదిలించుకున్న వారికీ సోషలిస్టు దేశాలు నిజమైన, చిత్తశుద్ధిగల మిత్రులు. శైశవదశలోనున్న రాజ్యాల అంతర్గత వ్యవహారాల్లో జోక్యం కలిగించుకోవడాన్ని వ్యతిరేకించడమే సోషలిస్టు దేశాలు సూత్రంగా పెట్టుకుంటాయి. అదే సమయంలో స్వాతంత్ర్యాలను కాపాడుకునే ప్రజలకు తోడ్పడటమనేది తమ అంతర్జాతీయ విధ్యుక్త ధర్మమని అవి భావిస్తాయి. అభివృద్ధిని సాధించేందుకూ, జాతీయ పరిశ్రమ నేర్పరచుకునేందుకూ, జాతీయ ఆర్థిక విధానాన్ని బలపరచుకొని సంఘటితపరచుకొనేందుకూ, తమవారినే సుశిక్షితులను చేసుకొనేందుకూ యీ దేశాలకు సోషలిస్టు రాజ్యాలు ఉదారంగా తోడ్పడతాయి. సామ్రాజ్యవాద దురాక్రమణను ఎదిరించడంలోనూ, ప్రపంచ శాంతికై పోరాడడంలోనూ అవి సహకరిస్తాయి.

"ఇతర జాతులను అణచిపెట్టిన జాతి ఏదీ స్వతంత్ర జాతి కాజాలద"ని గుర్తించిన వలస రాజ్యాలలోని వర్గ చైతన్యంగల కార్మికులు సామ్రాజ్యవాదుల క్రింద నలిగిపోతున్న జాతుల స్వయం నిర్ణయాధికారంకోసం నిలకడగా పోరాడారు. ఇప్పుడీ జాతులు జాతీయ స్వాతంత్ర్య పంథానుబట్టినవి గనుక సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా వారి పోరాటాలకు బాగా తోడ్పడటం పారిశ్రామికంగా అభివృద్ధిచెందిన పెట్టుబడిదారీ దేశాలలోని కార్మికులకూ, ప్రజాస్వామిక శక్తులకూ అంతర్జాతీయ విధ్యుక్త ధర్మం. జాతీయ స్వాతంత్ర్యంకోసం పోరాటంలోనూ, దాన్ని బలపరుచుకోవడంలోనూ, ఆర్థిక సాంస్కృతిక పునరుజ్జీవ సమస్యలను శక్తివంతంగా పరిష్కరించుకోవడంలోనూ తోడ్పడటం వారి విధి. ఆవిధంగా చేయడం ద్వారా కార్మికులు తమ దేశ ప్రజల ప్రయోజనాలను సంరక్షించిన వాళ్ళవుతారు.

వలసరాజ్య విధానం ఏ రూపంలో వున్నా, ఎలా ప్రదర్శిత మైనా తిరుగులేకుండా పూర్తిగా రద్దవడం ఎంత అవసరమో, గత

దశాబ్దాలలో జరిగిన ప్రపంచ చరిత్రంతా చాటి చెబుతోంది. ఇంకా వలస బానిసత్వంలో మగ్గుతున్న ప్రజలందరికీ స్వాతంత్ర్యం పొందడంలో ఎంతైనా సహాయపడాలి. వలస విధానం అన్ని రూపాల్లోనూ అంతరించాలి. వలస విధానం రద్దవడం అంతర్జాతీయ ఉద్రిక్తతను సడలించడానికి, విశ్వశాంతిని బలపరచడానికికూడా ఎంతో ముఖ్యం. ఆసియాలో, ఆఫ్రికాలో, లాటిన్ అమెరికాలో, ఓషియానియాలో సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా వీరోచిత పోరాటం సలుపుతున్న ప్రజలందరికీ యీ సమావేశం సౌహార్దతను తెలుపుతోంది. పూర్తిగా విముక్తి చెందటానికి ముఖ్యమైన మెట్టుగా రాజకీయ స్వాతంత్ర్యాలు పొందిన ఆఫ్రికన్ యువక రాజ్యాల ప్రజలందరినీ యీ సమావేశం అభినందిస్తోంది. జాతీయ స్వాతంత్ర్యంకోసం వీరోచిత పోరాటం సలుపుతున్న అల్జీరియా ప్రజలకు యీ సమావేశం హృదయపూర్వక అభినందనలు అందించుతోంది. అల్జీరియాపై జరుగుతున్న దురాక్రమణ యుద్ధాన్ని వెంటనే నిలుపుచేయమని డిమాండు చేస్తోంది. దక్షిణాఫ్రికాలో అమలు జరుగుతున్న అమానుష జాతివిచక్షణ నిర్బంధాన్ని, నిరంకుశత్వాన్ని యీ సమావేశం క్రోధపూరితంగా ఖండిస్తోంది. స్వాతంత్ర్య సమానత్వాలకోసం దక్షిణాఫ్రికా ప్రజలు జరుపుతున్న పోరాటానికి పూర్తిగా తోడ్పడాలని ప్రపంచంలో నున్న ప్రజాస్వామికవాదులందర్నీ కోరుతోంది. క్యూబాలో, కాంగోలో, అలాగే స్వాతంత్ర్యాలు పొందిన ఇతర దేశాల్లో వారి సర్వంసహాధికారాలకు భిన్నంగా జోక్యం కలిగించుకోవడం తగదని యీ సమావేశం హెచ్చరిస్తోంది.

వలసాధిపత్య నిరంకుశత్వంనుండీ, సామ్రాజ్యవాదంనుండీ విముక్తి పొందేందుకై పోరాడుతున్న ప్రజలకు పూర్తిగా నైతిక భౌతిక సహాయమివ్వడం తమ విధి అని అన్ని సోషలిస్టుదేశాలూ, అంతర్జాతీయ కార్మికవర్గమూ, కమ్యూనిస్టు ఉద్యమమూ గుర్తించాయి.

# 5

# క్రొత్తదశలో క్రొత్తఅవకాశాలు

ప్రపంచశక్తుల సమతూకంలో వచ్చిన క్రొత్తమార్పు ఫలితంగా శాంతి, జాతీయ స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యం, సోషలిజాల కొరకు పోరాడుతున్న కమ్యూనిస్టు, వర్కర్ల పార్టీలు తమ చారిత్రాత్మక కర్తవ్యం నిర్వహించేందుకు క్రొత్తఅవకాశాలు ఏర్పడ్డాయి.

తమ దేశాలలోని నిర్దిష్ట చారిత్రక, సాంఘిక పరిస్థితులను, అంతర్జాతీయ పరిస్థితిని దృష్టిలో పెట్టుకుని కమ్యూనిస్టుపార్టీలు విప్లవ కర్తవ్యాలను, లక్ష్యాన్ని నిర్ణయించుకుంటాయి. సోషలిజం జయప్రదమయ్యేవరకు ఆగకుండానే, ప్రస్తుత పరిస్థితులలోనే, శ్రామికవర్గం యొక్క, ప్రజలయొక్క జీవనప్రమాణాన్ని పెంచేందుకు, ప్రయోజనాలను కాపాడేందుకు, ప్రజల ప్రజాస్వామ్య హక్కులను విస్తరింపచేసేందుకు, నిస్వార్థపోరాటాన్ని కమ్యూనిస్టుపార్టీలు సాగిస్తూనే ఉన్నాయి. పెట్టుబడిదారీ దోపిడీనుండి ప్రజలను విముక్తిచేసే పోరాటంలో ప్రధానభారం తామే వహించాలని వీరికి తెలుసు. కనుకనే ప్రతిదేశంలోను దోపిడీదారుల దాడికి వ్యతిరేకంగా, రాజకీయ, ఆర్థిక, సైద్ధాంతిక రంగాలన్నిటిలోను కార్మికవర్గం, దాని అగ్రగామి పార్టీలు ఇతోధిక శక్తితో పోరాటాలు సాగిస్తాయి. ఈ పోరాటక్రమంలో ప్రజలు సన్నద్ధులౌతారు. పెట్టుబడిదారీ విధానాన్ని కూలదోసి, సోషలిస్టు విప్లవాన్ని జయప్రదం చేయడానికి నిర్ణయాత్మక పోరాటాలుచేసే పరిస్థితులు యేర్పడుతాయి.

ప్రస్తుత పరిస్థితులలో, గుత్త పెట్టుబడిదారీ సంస్థలకు వ్యతిరేకంగా ప్రధానమైన దాడి జరగవలసిఉంది. ఆయుధాలపోటీకి, దురాక్రమణ, అభివృద్ధి నిరోధకత్వాలకు, ఈ గుత్తసంస్థలే మూలాధారాలు.

ఈ గుత్తసంస్థలను కాపాడే, గుత్త పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరే
కంగా ప్రధానమైన దాడి జరగవలసి ఉంది.

యూరప్ ఖండానికి చెందనట్టి అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలు కొన్ని ఉన్నవి. ఇవి అమెరికన్ సామ్రాజ్యవాదుల, రాజకీయ, ఆర్థిక, సైనిక పెత్తనంకింద ఉన్నాయి. ఆ దేశాలలో కార్మికవర్గము, ప్రజలు అమెరికన్ సామ్రాజ్యవాదానికి, గుత్త పెట్టుబడికి, దేశ ప్రయోజనాలకు ద్రోహం చేస్తున్న దేశీయ అభివృద్ధి నిరోధకశక్తులకు వ్యతిరేకంగా ప్రధానమైన దాడి జరపవలసిఉంది. ఈ పోరాటంలో దేశంలోని ప్రజాతంత్ర దేశభక్త శక్తులన్నీ ఐక్య సంఘటనలో ఏక మౌతాయి. నిజమైన జాతీయ స్వాతంత్ర్యాన్ని, ప్రజాస్వామ్యాన్ని సాధించే విప్లవం కొరకు ఐక్యసంఘటన పోరాడుతుంది. సోషలిస్టు విప్లవంవైపు సాగిపోవడానికి అవసరమైన పరిస్థితులను ఈ విప్లవం కలిగిస్తుంది.

గుత్త పెట్టుబడి సంస్థలు కార్మికవర్గాలయొక్క, ప్రజలయొక్క ప్రయోజనాలపై ఎప్పుడూ దాడి చేస్తూనే ఉంటాయి. కార్మికవర్గంపై వీరి దోపిడీ తీవ్రత హెచ్చుతున్నది. అశేష రైతాంగం స్థితి అధ్వాన్నమౌతున్నది. దాంతోపాటు, చిన్న మధ్య తరహా, పట్టణ బూర్జువావర్గం అనుభవించే ఇబ్బందులూ ఎక్కువౌతున్నవి. గుత్త పెట్టుబడిదారీ వర్గాల దోపిడి, జాతిలోని అన్ని వర్గాలపైన మరింత భారమౌతున్నది. ఫలితంగా కొద్దిమంది గుత్తపెట్టుబడిదారులకు, మిగతా ప్రజలందరికీ మధ్య వైరుధ్యం రోజు రోజుకూ పెరుగుతున్నది. పెట్టుబడిదారీ వ్యవస్థలోని ప్రధాన వైరుధ్యమైన – పెట్టుబడిదారీ కార్మికవర్గ ఘర్షణ – దీంతోపాటు తీవ్రమౌతున్నది.

ప్రజల ప్రజాస్వామ్య హక్కులనుపూర్తిగా హరించాలని, లేక అతి కనీసస్థాయికి కుదింప చేయాలని గుత్త పెట్టుబడిదారులు ప్రయత్నిస్తున్నారు. కొన్ని దేశాలలో ఫాసిస్టు నియంతృత్వం నగ్నంగా కొనసాగుతున్నది. చాలా దేశాలలో ఫాసిస్టు శక్తులు కొత్త రూపాలలో తల ఎత్తుతున్నాయి. ప్రభుత్వ నిర్వహణలో నియంతృత్వ పద్ధతులు, నామమాత్రపు పార్లమెంటరీ సంప్రదాయాలు కలిసి ఉంటు

న్నాయి. ఈ నామమాత్ర సాంప్రదాయాలలో ప్రజాతంత్ర సారం లేదు. ఇవి కేవలం నామమాత్రమైనవి. సెక్కు ప్రజాస్వామ్య సంస్థలు నిషేధింపబడ్డాయి. ఇవి రహస్యంగా పనిచేయవలసి వస్తున్నది. కార్మిక వర్గ క్షేమం కొరకు, ప్రపంచశాంతి కొరకు పోరాడుతున్న వేలాది వీరులు జైళ్ళలో మగ్గుతున్నారు.

ప్రపంచ కమ్యూనిస్టుపార్టీల తరఫున ఈ మహాసభ జైళ్లలో మగ్గుతున్న సాహసోపేతులైన కార్మికవర్గ పుత్రులపట్ల, శాంతివీరుల పట్ల, అంతర్జాతీయసౌభ్రాతృత్వం వెల్లడిస్తున్నది. అమెరికా, స్పెయిన్, పోర్చుగల్, జపాన్, పశ్చిమజర్మనీ, గ్రీస్, ఇరాన్, పాకిస్తాన్, ఐక్య అరబ్ రిపబ్లిక్, మెక్సికో, దక్షిణాఫ్రికా, సూడాన్, తదితర దేశాలలో ఇట్టివీరులు జైళ్ళలో మగ్గుతున్నారు. శాంతి, జాతీయ స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యాల కొరకు పోరాడుతున్న ఈ వీరుల విడుదలకై శక్తివంతమైన ఉద్యమాలు ప్రారంభం కావాలని యీ మహాసభ విజ్ఞప్తి చేస్తున్నది.

గుత్త పెట్టుబడిదారీ విధానం రద్దుకావటంతోనే, కార్మిక, రైతాంగ, మేధావి, పట్టణ చిన్న, మధ్య బూర్జువావర్గాల ప్రయోజనాలు ఇమిడివున్నవి. కనుక వీరినందరినీ సమీకరించేందుకు అనుకూల పరిస్థితులున్నాయి.

ఇట్టి ఐక్యత ఈ క్రింది కార్యక్రమంద్వారా సాధ్యమని కమ్యూనిస్టులు అభిప్రాయపడుతున్నారు. శాంతి, జాతీయ స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్య రక్షణ, విస్తరణ, ఆర్థికరంగంలోని కీలకశక్తులను జాతీయంచేసి, వాటి నిర్వహణను ప్రజాతంత్రం చేయటం, ప్రజల అవసరాలను తీర్చేందుకై ఆర్థికవిధానాన్నంతా శాంతియుత ప్రయోజనాలకు వినియోగించడం, సమూలమైన వ్యవసాయ సంస్కరణలు, కార్మికుల జీవనప్రమాణం పెంచటం, రైతులప్రయోజనాలుకాపాడటం, గుత్త పెట్టుబడుల దాడికి వ్యతిరేకంగా, పట్టణాలలోని చిన్న, మధ్య బూర్జువావర్గ హక్కులను కాపాడటం అనే అంశాలపై పోరాడటం ద్వారా ఇట్టి ఐక్యత ఏర్పడుతుంది.

ఈ చర్యలు సామాజిక పురోభివృద్ధిలో ప్రధానమైన ముందడుగుగా ఉపకరిస్తాయి. అత్యధికులైన జాతిప్రజల ప్రయోజనాల కనుగుణ్యమైనవి. ఈచర్యలన్నీ ప్రజాతంత్ర స్వభావం కలిగినవి. ఒకవ్యక్తి మరొక వ్యక్తిని దోపిడీచేసే వ్యవస్థ వీటిద్వారా రద్దుకాదు. కాని ఈ చర్యలను అమలు జరిపినట్లయితే, గుత్తపెట్టుబడిదారుల పెత్తనం పరిమితం చేయబడుతుంది. దేశ రాజకీయాలలో కార్మికవర్గ స్థానం, రాజకీయ ప్రతిష్ఠ పెరుగుతాయి. కరుడుగట్టిన అభివృద్ధి నిరోధక శక్తులు వేరుచేయ బడతాయి. ప్రజా స్వామ్యశక్తుల ఐక్యత సాధ్యమౌతుంది. ఈ ప్రజాతంత్ర సంస్కరణలకై జరిగే పోరాటంలో పాల్గొనడంద్వారా, ప్రజలలో హెచ్చుభాగం కార్మికవర్గంతో ఐక్య కార్యాచరణ అవసరాన్ని గుర్తిస్తారు. రాజకీయంగా మరింత చైతన్యవంతులౌతారు.

ప్రజాతంత్ర సంస్కరణల కొరకు, గుత్త పెట్టుబడి సంస్థల అధికారం కూలదోసేందుకు ప్రజలు సాగించే ఆర్థిక, రాజకీయ పోరాటాలకు నాయకత్వం వహించి, వాటిని విజయవంతం చేయటం కార్మికవర్గంయొక్క, ఆ వర్గాల అగ్రగామి ఐన కమ్యూనిస్టుపార్టీ యొక్క ప్రధాన కర్తవ్యం.

ఆర్థిక, సాంఘిక వ్యవస్థను కార్యనిర్వాహక, రాజకీయ, సాంస్కృతిక సంస్థలను, సంఘాలను, ప్రజాతంత్రం చేయాలని కమ్యూనిస్టులు కోరుతుంటారు.

ప్రజాస్వామ్యం కొరకు జరిగే పోరాటం, సోషలిజానికై జరిగే పోరాటంలో భాగమేనని కమ్యూనిస్టులు భావిస్తారు. ఈ పోరాటంలో కార్మికవర్గంతో తమ సాన్నిహిత్యాన్ని కమ్యూనిస్టులు నిరంతరం హెచ్చు చేసుకుంటూరు. కార్మికవర్గ రాజకీయ చైతాన్యాన్ని పెంచటానికి, సోషలిస్టు విప్లవ కర్తవ్యాలను, దానిని పూర్తిచేయవలసిన అవసరాన్ని కార్మికవర్గం గుర్తించేటట్లు చేయటానికి కమ్యూనిస్టులు నిరంతరం కృషి చేస్తారు. సంస్కరణ వాదులకు, మార్క్సిస్టు లెనినిస్టులకుగల ప్రధానమైనతేడాయే ఇది. పెట్టుబడిదారీవ్యవస్థ పరిమితులలో జరిగే సంస్కరణలే అంతిమ లక్ష్యమని సంస్కరణవాదులు భావిస్తు

న్నారు. సోషలిస్టు విప్లవం అవశ్యకతను వారు నిరాకరిస్తారు. పెట్టుబడిదారీ దేశాల ప్రజలు తమ దైనందిన పోరాటాల క్రమంలో సోషలిజం ఒక్కటే తమ సమస్యలకు అంతిమ పరిష్కారమనే విషయం గుర్తిస్తారని, మార్క్సిస్టు లెనినిస్టుల దృఢ విశ్వాసం.

క్రియాశీలమైన వర్గపోరాటంలో ప్రజలు మరింతగా పాల్గొంటున్నారు. కనుక కమ్యూనిస్టులు తమ కార్యకలాపాలను సహకార సంఘాలకు, కార్మిక సంఘాలకు, రైతు, యువజన, మహిళా, క్రీడా సంస్థలకు, అసంఘటితులైన ప్రజలకూ – విస్తరింపచేయటం అవసరం. శాంతి, ప్రజాస్వామ్యాల పోరాటంలోకి, కమ్యూనిజం అనే మహాదాశయంకొరకు, యువతరంవారిని ఆకర్షించేందుకు కొత్త అవకాశాలు నేడున్నాయి.

ప్రజల్లోకి మరింత లోతుగా చొచ్చుకుపోవాలి. ప్రజలు ఎక్కడవుంటే అక్కడ కృషిచేయాలి. ప్రజలకు నాయకత్వం వహించేందుకై వారితో ఘనిష్టసంబంధా లేర్పరచుకోవాలి – అని లెనిన్ మహాశయుడిచ్చిన సందేశం, ప్రతి కమ్యూనిస్టుపార్టీ కార్యక్రమంలోను ముఖ్యాంశం కావాలి.

కార్మికవర్గం చీలిఉన్న దేశాలలోను, అంతర్జాతీయంగానూ కార్మికవర్గ ఐక్యత సాధించటం అత్యవసరం. రాజకీయ జీవితంలో కార్మికవర్గ పాత్రను హెచ్చుచేయిటానికి, వారి ప్రయోజనాలను రక్షించేందుకు ఇది అవసరం. కార్మికవర్గం వేర్వేరు సంఘాలలో చీలి ఉండవచ్చు. కాని వారి ప్రయోజనాలుమాత్రం ఒకటే. వేర్వేరు కార్మికసంఘాలు, సంస్థలు, ఇటీవలి కాలంలో ఐక్య వర్గపోరాటాలు జరిపిన సందర్భాలలో, అవి సాధారణంగా జయం పొందాయి. కార్మికవర్గ హక్కుల పోరాటంలో వారు ఐక్యత ప్రదర్శించినందు వలననే ఇది సాధ్యమయింది.

కార్మికవర్గ ఐక్యత తిరిగి స్థాపించేందుకు ముందు కొన్ని అత్యవసర కర్తవ్యాలు నిర్వహించాలని కమ్యూనిస్టుపార్టీలు విశ్వసిస్తున్నాయి. ఆ కర్తవ్యాల నిర్వహణకై నిర్విరామంగా కమ్యూనిస్టుపార్టీలు కృషి చేస్తాయి. కార్మికసంఘ ప్రజాస్వామ్యంలేని దేశాలలో కార్మికసంఘ

ఐక్యత ఏర్పడాలంటె, రాజకీయవివక్ష లెకుండా కార్మిక ప్రజలందరూ సంఘం ఏర్పరచుకునే హక్కు, స్వతంత్రంకొరకు ముందుగా కృషి చేయాలి.

ఇతర ప్రజాతంత్ర ఉద్యమాలలో కూడా జాతీయంగానూ, అంతర్జాతీయంగానూ ఐక్యత సాధించడం శాంతి, సమాజాభ్యుదయాలకు అత్యవసరం. శాంతి, జాతీయ స్వాతంత్ర్యం, ప్రజాతంత్ర హక్కుల రక్షణ, విస్తరణ, కార్మికప్రజల జీవన ప్రమాణం, సాంఘిక హక్కుల పెంపుదలకు జరిగే సంయుక్త పోరాటాలద్వారా ఈ ఐక్యతను సాధించవచ్చు.

పెట్టుబడిదారీ దేశాల ప్రజలు కర్తవ్యాల సాధనకై జరిపే పోరాటాలలో, కార్మికవర్గ, శ్రామిక, రైతాంగ ఐక్యత నిర్ణయాత్మక పాత్ర వహిస్తున్నది. సాంఘిక విప్లవానికి ఈ ఐక్యతే ప్రధాన చోదక శక్తి.

కార్మికవర్గ అనైక్యతను జాతీయ, అంతర్జాతీయ స్థాయిలలో ఇలాగే కొనసాగించాలని పాలకవర్గం మితవాద సోషల్ డెమోక్రటిక్ నాయకత్వం, కార్మిక సంఘాల అభివృద్ధి నిరోధక నాయకులు ప్రయత్నిస్తుంటారు. కార్మికవర్గ లక్ష్యసాధనకు వీరి ప్రయత్నాలే ప్రధాన ఆటంకం. కార్మికవర్గ అనైక్యతను తొలగించేందుకు కమ్యూనిస్టులు నిరంతర కృషి సాగిస్తుంటారు.

కార్మికవర్గ ఐక్యతను భగ్నంచేసేందుకుగాను, సామ్రాజ్యవాదులు, వివిధదేశాలలోని అభివృద్ధి నిరోధకులు, దౌర్జన్య పద్ధతులతో పాటు, లంచాలివ్వటం, మోసం చేయటంవంటి పద్ధతులను అవలంబిస్తున్నారు. ఈ అనైక్యత కార్మికవర్గానికి నష్టదాయకమనీ, సామ్రాజ్యవాదాభివృద్ధినిరోధకులకు మాత్రమే లాభకరమని గత కొలది సంవత్సరాల ఘటనలు తెలియజేస్తున్నాయి.

కొందరు మితవాద సోషల్ డెమోక్రట్లు బహిరంగంగానే సామ్రాజ్యవాద దృక్పధాన్ని అవలంబిస్తూ, పెట్టుబడిదారీ వ్యవస్థను సమర్థిస్తూ కార్మికవర్గ ఐక్యతను భగ్నంచెస్తున్నారు. కమ్యూనిజంపట్ల ఉండేద్వేషంతోను, ప్రపంచ వ్యవహారాలలో సోషలిజం ప్రభావం

పెరుగుదల పట్ల భయంతోను వీరు మితవాద అభివృద్ధి నిరోధక శక్తులకు లొంగిపోతున్నారు. కొన్ని దేశాలలో మితవాద నాయకత్వం, సోషల్ డెమోక్రటిక్ పార్టీలచే మార్క్సిజాన్ని, వర్గపోరాటాన్ని, సంప్రదాయమైన సోషలిస్టు నినాదాలను బహిరంగంగా తిరస్కరించే కార్యక్రమాన్ని ఆమోదింపజేశాయి. ఈ విధంగా వీరు బూర్జువావర్గ ప్రయోజనాలను కాపాడుతున్నారు. ఈ మితవాద నాయకుల విధానాలకు ప్రతిఘటన సోషల్ డెమోక్రటిక్ పార్టీలలో పెచ్చుపెరుగుతున్నది. కొందరు సోషల్ డెమోక్రటిక్ కార్యకర్తలు కూడా ఈ ప్రతిఘటనలో చేరుతున్నారు. కార్మిక వర్గము, ఇతర శ్రామికప్రజలు, శాంతి, ప్రజాస్వామ్యం, సమాజాభ్యుదయాలకు ఐక్యపోరాటాలు జరపాలని వాంఛించే శక్తులుపెరుగుతున్నాయి. సోషల్ డెమోక్రటిక్ పార్టీలలోని అత్యధిక సంఖ్యాకులు, ముఖ్యంగా కార్మికులు శాంతి, సమాజాభ్యుదయాలకు మిత్రులు.

సోషల్ డెమోక్రటిక్ పార్టీల మితవాద అవకాశవాద నాయకుల సిద్ధాంతాలను కమ్యూనిస్టులు విమర్శిస్తూనేఉంటారు. సోషల్ డెమోక్రటిక్ పార్టీలలోని ప్రజలు, పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకంగాను, ఖచ్చితమైన సోషలిజం విజయానికి అనుకూలంగాను, వర్గ పోరాటవైఖరిని అవలంబించాలని ప్రచారం చేస్తూనేవుంటారు. అయితే, సిద్ధాంతవిషయాలలో తమకు, సోషల్ డెమోక్రట్లకు మధ్య గల విభేదాలు, కార్మికవర్గ ప్రధానసమస్యలపై పరస్పరం అభిప్రాయాలను తెలియజేసుకునేందుకు, ఐక్య పోరాటానికి, ముఖ్యంగా యుద్ధప్రమాదానికి వ్యతిరేకంగా ఐక్యపోరాటం జరపటానికి — ఆటంకం కారాదని కమ్యూనిస్టులు ఖచ్చితంగా అభిప్రాయపడుతున్నారు.

శ్రామికప్రజలలోని సోషల్ డెమోక్రట్లను తమ వర్గసోదరులుగా కమ్యూనిస్టులు భావిస్తారు. కార్మికసంఘాలలోను, ఇతరసంస్థలలోను వారు తరచు కలసి పనిచేస్తూంటారు. కార్మికవర్గం యొక్క, ప్రజలందరియొక్క ప్రయోజనాలకై వారు ఐక్యంగా పోరాడుతూంటారు.

కార్మికవర్గ తక్షణ ప్రయోజనాలదృష్ట్యా, జాతీయ అంతర్జాతీయ స్థాయిలలో కమ్యూనిస్టులు, సోషల్ డెమోక్రట్లు సంయుక్త కార్యాచరణకు పూనుకోవాలి. అణ్వాయుధాల తయారీ, పరీక్షలు, ఉపయోగం తక్షణం నిషేధించాలని, అణ్వస్త్రరహిత మండలాలేర్పర చాలని, అంతర్జాతీయ అజమాయిషీక్రింద సాధారణ, సంపూర్ణ నిరాయుధీకరణ జరగాలని, విదేశాలలో సైనిక స్థావరాలు రద్దయి, విదేశీ సైన్యాల ఉపసంహరణ జరగాలని, ఈ సంయుక్త కార్యాచరణ ఆశించాలి. వలస, అధీన దేశాల జాతీయ విముక్తి ఉద్యమాలకు సాయం చేసేందుకు, జాతీయ స్వాతంత్ర్య రక్షణకు, ప్రజాస్వామ్యాన్ని రక్షించి, ఫాసిస్టు ప్రమాదాన్నెదుర్కొనేందుకు, జీతాల కోతలేకుండా తక్కువ పనిగంటలద్వారా, కార్మిక ప్రజల జీవన ప్రమాణం పెంచేందుకు, ఈ కార్యక్రమం జరగాలి. ఈ సమస్యల పరిష్కారానికై లక్షలాది సోషల్ డెమోక్రట్లు, కొన్ని సోషల్ డెమోక్రటిక్ పార్టీలుకూడా ఇది వరకే సంసిద్ధత వెలిబుచ్చారు.

కనుక తన వర్గంలోని అనైక్యతను అధిగమించుట ద్వారా, తన అన్ని శాఖలలోను ఐక్యకార్యాచరణ సాధించుట ద్వారా, పెట్టుబడిదారీ దేశాలలో కార్మికవర్గం పాలకవర్గాల విధానాలపై గట్టి దెబ్బతీయగలదని నమ్మకంగా చెప్పవచ్చు. ఒక కొత్తయుద్ధానికిజరిగే యత్నాలను విరోధించవచ్చు. గుత్తపెట్టుబడిదారుల దాడిని విరోధించవచ్చు, ముఖ్యమైన దైనందిన ప్రజాస్వామ్యకోర్కెలను, కార్మిక వర్గం సాధించవచ్చు.

శ్రామిక ప్రజల జీవన పరిస్థితులను మెరుగుచేయడంలోను, ప్రజాస్వామ్య హక్కుల రక్షణ, విస్తరణలోను, జాతీయ స్వాతంత్ర్య సంపాదన రక్షణల్లోను, ప్రపంచ శాంతికి అధికారం స్వీకరించి సోషలిజం స్థాపించేందుకు జరిపే పోరాటంలోను, కమ్యూనిస్టు పార్టీలు, సోషలిస్టు పార్టీలతో సహకారాన్ని కోరుతున్నాయి.

సక్రమమైన, శాస్త్రీయంగా పరిపుష్టమైన జీవితానుభవంలో రుజువైన మహత్తరమైన మార్క్సిజం లెనినిజం – సిద్ధాంతమూ, సోషలిస్టు సమాజ నిర్మాణంలోని విలువైన అంతర్జాతీయ అనుభవమూ

కమ్యూనిస్టుపార్టీల మన్నాయి. సోషల్ డెమోక్రట్లతో చర్చలకు కమ్యూనిస్టులు ఎప్పుడూ సిద్ధంగానే ఉంటారు. అభిప్రాయాలను, ధోరణులను, అనుభవాలను పోల్చుకోటానికి దీర్ఘకాలంగా ఏర్పడిన దురభిప్రాయాలను, కార్మికవర్గ అనైక్యతను తొలగించుకోటానికి, సహకారాన్ని ఏర్పరచుకోటానికి ఇదే ఉత్తమమైన పద్ధతని కమ్యూనిస్టుల నమ్మకం.

అభివృద్ధి నిరోధక సామ్రాజ్యవాదులు కమ్యూనిస్టు సిద్ధాంతం పట్ల, ఉద్యమంపట్ల అనుమానాన్ని రెచ్చగొట్టటానికి యత్నిస్తుంటారు. పెట్టుబడిదారీ విధానాన్ని కూలద్రోసి, సోషలిజం స్థాపించటానికి వివిధదేశాల మధ్య కమ్యూనిస్టులు యుద్ధాలను వాంఛిస్తుంటారని వీరు ప్రజలను భయపెడుతుంటారు. ఈ అపవాదును కమ్యూనిస్టు పార్టీలు ఖచ్చితంగా నిరాకరిస్తున్నాయి. సామ్రాజ్యవాదులు ప్రారంభించిన రెండు ప్రపంచయుద్ధాలు సోషలిస్టు విప్లవాలకు తోవతీసిన మాట నిజమే. అయితే దానిఅర్థం, సాంఘిక విప్లవానికి ప్రపంచ యుద్ధమే తప్పనిసరి మార్గమని కాదు. అందులోనూ, శక్తివంతమైన సోషలిస్టు ప్రపంచ వ్యవస్థ ఏర్పడిన ఈనాడు అసలేకాదు. వివిధదేశాల మధ్య యుద్ధాలు సాంఘిక విప్లవానికి మార్గమని మార్క్సిస్టు–లెనినిస్టులు ఏనాడూ భావించలేదు.

ప్రతిదేశ ప్రజలకు తమ కిష్టమైన సామాజిక వ్యవస్థను ఎన్నుకొనే హక్కు తొలగించ వీలులేని హక్కు ఉన్నది. సోషలిస్టు విప్లవాన్ని ఎగుమతి చేయలేము. పైనుంచి విధించనూలేము. దేశ అంతరంగిక పరిణామాల ఫలితంగా, సాంఘిక వైరుధ్యాలు పరిపక్వం చెందిన ఫలితంగా అది జరుగుతుంది.

మార్క్సిజం – లెనినిజం సిద్ధాంతా లనుసరిస్తున్న కమ్యూనిస్టు పార్టీలు, విప్లవాలఎగుమతికి మొదటనుండి వ్యతిరేకంగానేఉంటూవచ్చాయి. అదేసమయంలో సామ్రాజ్యవాదులు ప్రతీఘాత విప్లవాన్ని ఎగుమతి చేయటాన్నికూడా వీరు దృఢంగా ఎదుర్కొంటారు విప్లవ కార్యాచరణకు పూనుకున్న ఒక దేశప్రజల వ్యవహారాలలో సామ్రాజ్యవాదులు కల్పించుకునే జోక్యాన్ని నిరోధించేందుకు, లేక ఖచ్చితంగా ప్రతిఘటించేందుకు

ప్రపంచ ప్రజలందరూ ఐక్యంకావాలని, తమ అంతరంగిక శక్తులను కూడతీసుకోవాలని, ప్రపంచ సోషలిస్టువ్యవస్థ బలంపై ఆధారపడి శక్తివంతమైన చర్యతీసుకోవాలని పిలుపివ్వడం తమ అంతర్జాతీయ బాధ్యతగా కమ్యూనిస్టుపార్టీలు భావిస్తాయి.

సోషలిస్టు విప్లవాన్ని జయప్రదంచేసి, కార్మికవర్గ నియంతృత్వాన్ని, ఏదో ఒక రూపంలో-స్థాపించటానికి, మార్క్సిస్టు - లెనినిస్టు పార్టీలు, కార్మికవర్గంయొక్క, శ్రామిక ప్రజలయొక్క పోరాటాలకు నాయకత్వం వహిస్తాయి. సోషలిస్టు విప్లవ పురోగతి, రూపం- అయా దేశాలలోని నిర్దిష్టమైన వర్గసంబంధాల తూకంమీాద, కార్మికవర్గం, దాని అగ్రగామిశక్తుల సంఘటిత శక్తి పరిపక్వతలపైన, పాలకవర్గం ప్రదర్శించే ప్రతిఘటనపైన ఆధారపడి ఉంటాయి. కార్మిక వర్గ నియంతృత్వం ఏ రూపంలో స్థాపించబడినప్పటికీ, అది ప్రజాస్వామ్య విస్తరణకు చిహ్నం. నామమాత్ర బూర్జువా ప్రజాస్వామ్యం నుండి నిజమైన ప్రజాస్వామ్యానికి, కార్మికవర్గ ప్రజాస్వామ్యానికి జరిగే పరిణామం.

వివిధ దేశాలలో పెట్టుబడిదారీ వ్యవస్థకు, సోషలిజానికి మధ్య ఏర్పడే పరిణామ రూపాల విషయమై 1957 ప్రకటనలో చెప్పబడిన ప్రతిపాదనలను కమ్యూనిస్టుపార్టీలు పునరుద్ఘాటిస్తున్నాయి.

కార్మికవర్గమూ, దాని అగ్రగామి శక్తిఐన మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీ, శాంతియుత పద్ధతుల ద్వారానే సోషలిస్టు విప్లవాన్ని సాధించటానికి ప్రయత్నిస్తాయని 1957 ప్రకటన స్పష్టంచేసింది. ఈ ప్రకటన కార్మికవర్గం యొక్క, మొత్తం ప్రజలయొక్క, మొత్తం జాతియొక్క ప్రయోజనాలకు అనుగుణంగా ఉంది.

ఈనాడు, పలు పెట్టుబడిదారీ దేశాలలో కార్మికవర్గం ఐక్యమై వివిధ పార్టీలమధ్య, ప్రజాసంస్థలమధ్య ప్రజాతంత్ర సంఘటన లేక మరో రకమైన ఒప్పందం, రాజకీయ సహకారం సాధించగలిగితే కార్మికవర్గానికి, దాని అగ్రగామిశక్తి నాయకత్వాన, అధిక సంఖ్యాక ప్రజలను ఐక్యంచేసి అంతర్యుద్ధం లేకుండానే, రాజ్యాధికారం చేజిక్కించుకుని, ప్రధానమైన ఉత్పత్తిశక్తుల యాజమాన్యాన్ని

ప్రజాసముదాయంగల అవకాశం ఏర్పడ్డది. అధిక సంఖ్యాక ప్రజలపై ఆధారపడి, పెట్టుబడిదారీ, భూస్వామ్య శక్తులతో రాజీపడే ధోరణిని విడనాడలేని అవకాశవాద శక్తులను ఖచ్చితంగా తిప్పికొడుతూ, కార్మికవర్గం, అభివృద్ధినిరోధక, ప్రజావ్యతిరేక శక్తులను ఓడించ గలదు. పార్లమెంటులో మెజారిటీ స్థానాలు సంపాదించగలదు. పార్లమెంటును, బూర్జువావర్గ ప్రయోజనాలు కాపాడే సాధనమునుండి, కార్మికవర్గ ప్రయోజనాలను రక్షించే సాధనంగా మార్చగలదు. పార్లమెంటుకు వెలుపల ప్రజాపోరాటాలు నడపగలదు. అభివృద్ధినిరోధక శక్తుల ప్రతిఘటనను ఓడించగలదు. సోషలిస్టు విప్లవాన్ని శాంతియుతంగా పూర్తి చేసేందుకు అవసరమైన పరిస్థితులను కలిగించ గలదు.

గుత్త పెట్టుబడికి, అభివృద్ధి నిరోధకశక్తులకు వ్యతిరేకంగా సమూలమైన సాంఘిక సంస్కరణలకు, శాంతి, సోషలిజంకొరకు, కార్మిక, రైతు, పట్టణ మధ్యతరగతి ప్రజల వర్గపోరాటాలను నిరంత రాయంగా విశాల ప్రాతిపదికపై కొనసాగించినప్పుడే ఇదంతా సాధ్య మౌతుంది.

ప్రజలకు వ్యతిరేకంగా దోపిడీవర్గాలు దౌర్జన్యానికే పూను కున్నప్పుడు, శాంతియుత పరిణామంకంటె భిన్నమైన మార్గానికి గల అవకాశాన్ని గుర్తించుకొనటంఅవసరం. పాలకవర్గాలు అధికారాన్ని ఎప్పుడూ ఐచ్ఛికంగా వదలుకోవని లెనినిజం ప్రబోధిస్తున్నది. అను భవం రుజువు చేస్తున్నది. అట్టి సందర్భంలో, వర్గపోరాటాల రూపం, వాటి తీవ్రతాస్థాయి కార్మికవర్గంమీదకంటే, అధికసంఖ్యాకులైన ప్రజలకోర్కెలకు వ్యతిరేకంగా అభివృద్ధి నిరోధకవర్గాలు ప్రదర్శించే ప్రతిఘటనపైన, సోషలిజానికి జరిగే పోరాటంలో ఏదో ఒక దశలో ఈ అభివృద్ధి నిరోధకశక్తులు ప్రయోగించే దౌర్జన్యంపైన ఆధారపడి ఉంటాయి.

సోషలిజానికి జరిగేపరిణామం ప్రతి ఒక్క దేశంలో ఏ మార్గం [redacted]ంటుందన్న సమస్య, ఆ దేశంయొక్క నిర్దిష్టచారిత్రక పరిస్థితులపై [redacted] ఉంటుంది.

ఈనాడు, కమ్యూనిజం అత్యంత అభివృద్ధికరమైన సిద్ధాంతం మాత్రమేకాదు. ఆచరణలో, పెట్టుబడిదారీ వ్యవస్థకంటే ఉన్నతమైనదని నిరూపించుకునే ఒక సామాజికవ్యవస్థ. కనుక కమ్యూనిస్టుపార్టీల పలుకుబడిని విస్తరింపచేసేందుకు కార్మికవర్గానికి వ్యతిరేకంగా పెట్టుబడిదారీ వర్గం సాగించే పోరాటానికి ముసుగుగా వినియోగించే కమ్యూనిస్టు వ్యతిరేకనినాదంలోని బండారాన్ని బైట పెట్టేందుకు, కమ్యూనిస్టు సిద్ధాంతాలవైపు అశేష శ్రామిక ప్రజానీకాన్ని ఆకర్షించేందుకు ప్రత్యేకంగా అనుకూల పరిస్థితు లున్నాయి.

కార్మికవర్గ ఉద్యమం తలయెత్తిన మొట్టమొదటి రోజులలో, కార్మికవర్గానికీ, మార్క్సిస్టు సిద్ధాంతానికీ వ్యతిరేకంగా పెట్టుబడిదారీ వర్గం ప్రయోగించిన ముఖ్య సిద్ధాంత ఆయుధంగా, కమ్యూనిస్టు వ్యతిరేకత-ఏర్పడ్డది. ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ ఏర్పడినమీాదట, వర్గపోరాటు తీవ్రత హెచ్చినకొద్దీ, కమ్యూనిస్టు వ్యతిరేకత మరింత విద్రోహ పూరితమూ, విధ్వంసకరమూ అయింది. బూర్జువా సిద్ధాంతంయొక్క అత్యంతపతనావస్థకు సిద్ధాంత సంక్షోభానికి కమ్యూనిస్టు వ్యతిరేకత చిహ్నం. మార్క్సిస్టు సిద్ధాంతానికి వక్రభాష్యాలు చెప్పడం, సోషలిస్టు సామాజిక వ్యవస్థపై నీచారోపణలు చేయటం, కమ్యూనిస్టులక్ష్యాలను, విధానాలనుతప్పుడుగాచిత్రించడం, ప్రజాతంత్ర శాంతికాముక శక్తులపైన, సంస్థలపైన దారుణ దమననీతి ప్రయోగించటం— వంటి రూపాలను కమ్యూనిస్టు వ్యతిరేకత స్వీకరిస్తున్నది.

కార్మికవర్గ ప్రయోజనాలను సమర్థవంతంగా కాపాడేందుకు, శాంతిని కాపాడేందుకు, కార్మికవర్గ ఆశయమైన సోషలిజాన్ని సాధించేందుకు, కమ్యూనిస్టు వ్యతిరేకతపై ఖచ్చితమైన పోరాటం జరపవలసిఉంది. ప్రజలు సోషలిజంవైపు ఆకర్షింపబడకుండా అడ్డుకొట్టేందుకు బూర్జువావర్గం ప్రయోగించే విషపూరిత ఆయుధమే కమ్యూనిస్టు వ్యతిరేకత. శ్రామిక ప్రజలకు సోషలిస్టుభావాలను వివరించడంలోనూ, విప్లవ వర్గచైతన్యాన్ని వృద్ధిచేసి విప్లవ దృక్పథంలో శ్రామికజనులను తరిఫీదు చేయటంలోనూ, మరింత గట్టికృషిఅవసరం.

ప్రపంచ సోషలిస్టు వ్యవస్థలోని దేశాల అనుభవాలను వివరించుట ద్వారాను, కార్మిక – రైతు తదితర ప్రజలకు ప్రతి దేశంలోనూ సోషలిజంద్వారా కలిగే లాభాలను స్పష్టంచేయడంద్వారానూ, సోష లిస్టువ్యవస్థ ఔన్నత్యాన్ని శ్రామిక ప్రజలకు తెలియజెప్పటం అవసరం.

యుద్ధభీతినుండి ప్రపంచప్రజలకు కమ్యూనిజం రక్షణ కల్పి స్తుంది. సుస్థిరశాంతి స్థాపిస్తుంది. సామ్రాజ్యవాద దోపిడీ,దాడి, పీడన నుండి, నిరుద్యోగ, దారిద్ర్యబాధలనుండి విముక్తి కలిగిస్తుంది. కమ్యూనిజం ఉన్నత జీవితప్రమాణాలను, సర్వవ్యాపిత సౌభాగ్యాన్ని కలిగిస్తుంది. ఆర్థికసంక్షోభాల భయాన్ని తొలగిస్తుంది. మొత్తం సమాజ శ్రేయస్సుగృష్ట్యా ఉత్పత్తిశక్తుల సత్వరాభివృద్ధికి కృషి చేస్తుంది. ధనికవర్గాల దోపిడీనుండి వ్యక్తికి విముక్తి కలిగిస్తుంది. మానవుని సర్వతోముఖ మానసికాభివృద్ధికి అవకాశం కలిగిస్తుంది. అభివృద్ధిలేని శాస్త్రీయ, సాంస్కృతిక అభివృద్ధికి, మానవసామర్థ్య సంపూర్ణవికాసానికి మార్గం సుకరం చెస్తుంది. ప్రజలలోని అన్ని వర్గాలు, కొద్ది దోపిడీవర్గాలు మినహా ఈ నూతన సాంఘికవ్యవస్థ విజ యం ఫలితంగా లాభం పొందుతారు. పెట్టుబడిదారీ దేశాలలోని లక్షలాది ప్రజలకు ఈ విషయం స్పష్టం చేయవలసిన అవసరం ఉంది.

# 6

# ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ సమైక్య, సంఘటితశక్తి

ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమం మన కాలంలోని అత్యంత ప్రభావంగల రాజకీయశక్తిగానూ, సమాజపురోగమనంలో మిక్కిలి ప్రధానమైన శక్తిగానూ తయారైనది. కార్మికవర్గ ప్రయోజనాల

కొరకూ, మొత్తం శ్రామికప్రజల ప్రయోజనాలకొరకూ; శాంతి, జాతీయస్వాతంత్ర్యము, ప్రజాతంత్రము, సోషలిజముల కొరకూగాను సామ్రాజ్యవాద అభివృద్ధి నిరోధకానికి వ్యతిరేకంగా గట్టిగా పోరాడే కొలదీ కమ్యూనిస్టు వుద్యమం నిలకడగా ముందుకు సాగిపోతూ వున్నది; మరింతగా గట్టిపడి, కాకలుతీరుతోంది.

నేడు ప్రపంచంలో 87 దేశాలలో కమ్యూనిస్టుపార్టీలు పని చేస్తూ వున్నవి. వాటి మొత్తంసభ్యత్వం 3 కోట్ల 60 లక్షలకుపెంచింది. ఇది మార్క్సిజం—లెనినిజముకు ఘనమైనవిజయం; కార్మికవర్గం యొక్క బ్రహ్మాండమైన కార్యసాధన. వలస నిర్బంధంనుండి విముక్తిపొంది స్వతంత్రాభివృద్ధి పథాన్ని చేబట్టిన దేశాలలో ఒకే భావాలుగల మార్క్సిస్టులందరూ సమీకృతమౌతూన్నారు: తమ దేశాలలోని కార్మికవర్గం మధ్యనూ, సామ్రాజ్యవాద వ్యతిరేక ఉమ్మడిపోరాటాలలో స్వాతంత్ర్యాన్ని సాధించుకొన్న దేశాలలో కార్మికవర్గం జరిపే పోరాటాల మధ్యనూ స్నేహాన్నీ, సౌహార్ధతనూ పెంపొందించడాన్ని కమ్యూనిస్టుపార్టీలు తమ అంతర్జాతీయ కర్తవ్యంగా భావించుతాయి.

కమ్యూనిస్టుపార్టీలవృద్ధీ, వాటి నిర్మాణం మరింత సంఘటితం కావటమూ, మార్క్సిస్టు పెడధోరణులకు వ్యతిరేకంగా జరిగే పోరాటంలో అనేక దేశాలలోని కమ్యూనిస్టుపార్టీలు విజయాలను సాధించటమూ, వ్యక్తిపూజవల్ల కలిగే హానికరమైన ఫలితాలను అంతమొందించటమూ, ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమంయొక్క పలుకుబడి పెరగటమూ, ఇవన్నీకూడా కమ్యూనిస్టుపార్టీలు తమ ముందున్న కర్తవ్యాలను జయప్రదంగా పూర్తి చేస్తానికి కొత్త అవకాశాలను ఏర్పర్చినవి.

కేంద్రీకృత ప్రజాతంత్ర సూత్రానికి అనుగుణ్యంగా పార్టీ జీవితాన్ని నడపటంలో లెనినిస్టు ప్రమాణాలను ఖచ్చితంగా అమలు జరుపుతూ, పార్టీ ఐక్యతను కంటిలోపాపవలె సంరక్షించటమూ; లెనినిజం నిర్మాణ సూత్రాలకు అనుగుణ్యంగా, పార్టీ జీవితంలో పార్టీ నాయకత్వ సంస్థల పాత్రకు గొప్పప్రాముఖ్యత వున్నదని గుర్తిస్తారు. కాబట్టి పార్టీ ప్రజాతంత్రము; సమిష్టి నాయకత్వ సూత్రానికి ఖచ్చితంగా కట్టుబడివుండటమూ; పార్టీ సభ్యత్వం

లోనూ, విస్తార శ్రామిక ప్రజాబాహుళ్యంలోనూ తగు సన్నిహిత సంబంధాలను బలపర్చుకోంటానికి విసుగు విరామం లేకుండా కృషి జేస్తూ, కమ్యూనిస్టుల సృజనాత్మక ఆలోచననూ, చొరవనూ అరికట్టే వ్యక్తిపూజకు ఆస్కారంలేకుండా చేయటమూ; కమ్యూనిస్టుల కార్యాచరణను బలీయంగా పెంపొందిస్తూ, పార్టీ సభ్యులలో విమర్శన, ఆత్మవిమర్శనలను ప్రోత్సహించటమూ, తమ కార్యకలాపాలను తీర్చిదిద్దే అఖండ సూత్రాలుగా మార్క్సిస్టు - లెనినిస్టు పార్టీలు భావిస్తాయి.

తమ శ్రేణులలోనేవుండి మార్క్సిస్టు – లెనినిస్టు పంథానుండి తమ్ము వేరుమార్గానికి మళ్ళించజూచిన రివిజనిస్టులను కమ్యూనిస్టు పార్టీలు సిద్ధాంతరంగంలో ఓడించాయి. రివిజనిజానికీ, మితవాద అవకాశవాదానికీ వ్యతిరేకంగా జరిగిన పోరాటాలలో ప్రతిఒక్క కమ్యూనిస్టుపార్టీ, మొత్తం అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమమూ సిద్ధాంతరీత్యానూ, నిర్మాణరీత్యానూ కూడా మరింతబలపడినవి.

కేంద్రీకృత రూపంలోవున్న ఆధునిక రివిజనిస్టు "సిద్ధాంతాల" రూపమే యుగోస్లావ్ తరహా అంతర్జాతీయ అవకాశవాదం; కమ్యూనిస్టుపార్టీలు యుగోస్లావ్ తరహా అంతర్జాతీయ అవకాశవాదాన్ని ఏకగ్రీవంగా ఖండించినవి. మార్క్సిజం లెనినిజములు బూజుపట్టిపోయినవంటూ దానికి ద్రోహం తలపెట్టిన తర్వాత యుగోస్లేవియా కమ్యూనిస్టులీగు నాయకులు 1957 ప్రకటనకు పోటీగా లెనినిస్టు వ్యతిరేక, రివిజనిస్టు కార్యక్రమాన్ని ముందుంచారు. మొత్తం అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమానికిపోటీగా తమ యుగోస్లేవియా కమ్యూనిస్టులీగును నిలబెట్టారు. తమ దేశాన్ని సోషలిస్టు శిబిరంనుండి వేరుచేశారు. దానిని అమెరికా, తదితర సామ్రాజ్యవాదుల 'సహాయం' అనబడేదానిపై ఆధారపడేటట్లుగా చేశారు; ఆవిధంగా, వీరోచితపోరాటాల ద్వారా యుగోస్లేవియా ప్రజలు సాధించిన విప్లవ విజయాలను పోగొట్టే ప్రమాదాన్ని తెచ్చిపెట్టారు. సోషలిస్టు శిబిరానికీ, ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమానికీ వ్యతిరేకంగా యుగోస్లేవియా రివిజనిస్టులు విద్రోహకార్యాలను తల

పెట్టారు. కూటములకు దూరంగా వుండటమనే ముసుగుతో వారు, మొత్తం శాంతికాముక శక్తులయొక్క, దేశాలయొక్క ఐక్యతకు భంగంకల్గించే కార్యకలాపాలకు పూనుకొన్నారు. యుగోస్లావియా రివిజనిస్టు నాయకులను మరింతగా బట్టబయలు చేయడమూ, యుగోస్లోనియా వారి లెనినిస్టువ్యతిరేకభావాలనుండి కమ్యూనిస్టు వుద్యమాన్నీ, కార్మికోద్యమాన్నీ సంరక్షించటానికై తీవ్రపోరాటాన్ని సాగించటమూ మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీలముందున్న అవశ్యకర్తవ్యం.

మార్క్సిజం - లెనినిజం అఖండ బలాన్నీ, అఖిల విజయశక్తినీ కలిగివున్నదని కార్మికవర్గ ప్రత్యక్ష పోరాటాలూ, మొత్తం సమాజాభివృద్ధితీరూ మరొక పర్యాయం రుజువుచేసినవి; ఇంతేగాక, ఆధునిక రివిజనిస్టు "సిద్ధాంతాలు" అన్నీ పూర్తిగా తప్పుఅనికూడా రుజువుచేసినవి.

కమ్యూనిస్టు వుద్యమాన్నీ, కార్మికోద్యమాన్నీ మరింత అభివృద్ధి చేయాలంటే 1957 ప్రకటనలో చెప్పినట్లుగా, ప్రధాన ప్రమాదంగా నిల్చివున్న రివిజనిజానికి వ్యతిరేకంగానూ, పిడివాదము, సెక్టేరియ నిజములకు వ్యతిరేకంగానూ, రెండురంగాలలో దృఢమైన పోరాటాన్ని సాగించాలి.

సిద్ధాంతాలలోనూ, ఆచరణలోనూ బూర్జువా తాత్విక ఆలోచనను ప్రతిబింబించే రివిజనిజము, మితవాద అవకాశవాదం, మార్క్సిజము - లెనినిజముకు వక్రభాష్యం చెప్పి, దానిలోని విప్లవ సారాన్ని హరింపజేస్తాయి. ఆ విధంగా కార్మికవర్గ విప్లవ సంకల్పాన్ని స్థంభింపజేస్తుంది. సామ్రాజ్యవాదుల, దోపిడీదారుల పీడనకు వ్యతిరేకంగా జరిపే పోరాటంలో, శాంతి, ప్రజాతంత్రము, జాతీయ విముక్తుల కొరకు జరిపే పోరాటంలో, సోషలిజం విజయంకొరకై జరిపే పోరాటంలో కార్మికులనూ, మొత్తం శ్రామిక ప్రజలనూ నిరాయుధం జేస్తుంది; వారి సంఘటితశక్తిని చెదరగొట్టుతుంది.

పిడివాదానికి, సెక్టేరియనిజముకు వ్యతిరేకంగా నిరంతరమూ పోరాడకపోయినచో, ఆయా పార్టీల అభివృద్ధిలో సిద్ధాంత కార్యాచరణలో ఒకానొక దశలో అవికూడా ప్రధాన ప్రమాదములుగా తయారు కావచ్చును. శాస్త్రీయ అనుశీలనంద్వారా మార్క్సిజము-లెని

నిజమును అభివృద్ధిచేస్తానికీ,నిర్ణీత పరిస్థితులకు దానిని సృజనాత్మకంగా అనువర్తింపజేస్తానికి విప్లవపార్టీలకుండే సామర్థ్యాన్ని అది పోగొట్టుతుంది. శ్రామిక ప్రజల విస్తార ప్రజా బాహుళ్యంనుండి కమ్యూనిస్టులను దూరంజేసి, వారిని జడాత్మకపుటాశలకో, లేక, విప్లవ పోరాటంలో అతివాద, దుస్సాహసిక చర్యలకో పూనుకొనేటట్లు చేస్తుంది. మారే పరిస్థితినీ, కొత్త అనుభవాన్ని కమ్యూనిస్టుపార్టీలు సకాలంలో సరిగా అవగాహనచేసుకోకుండా అవి అడ్డగిస్తాయి; సామ్రాజ్య వాదము, అభివృద్ధి నిరోధకము, యుద్ధ ప్రమాదములకు వ్యతిరేకంగా కార్మికవర్గమూ, మొత్తం ప్రజాతంత్ర శక్తులూ సాగించే పోరాటంలో విజయాన్ని సాధించటానికిగాను వున్న అన్ని అవకాశాలనూ వినియోగించుకొనకుండా అడ్డగిస్తాయి. ఆ విధంగా తమ ధర్మ యుద్ధంలో ప్రజలు విజయాన్ని సాధించకుండా అడ్డుపడతాయి.

కమ్యూనిజంతో పోరాడుటకుగాను అంతర్జాతీయ అభివృద్ధి నిరోధకశక్తి తన బలాల నన్నిటినీ సమీకరించుకొనే తరుణంలో, అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమాన్ని సుస్థిరం చేసుకోవలసిన అవసరం చాలా హెచ్చుగా వున్నది. ఐక్యత, దృఢమైత్రి మన వుద్యమ బలాన్ని ద్విగుణీకృతంజేస్తాయి. కమ్యూనిస్టు మహోద్యమం జయప్రదంగా పురోగమిస్తానికీ, శత్రువుయొక్క అన్ని దాడులను శక్తివంతంగా తిప్పికొట్టడానికీ సమ్మకమైన హామీని చేకూర్చుతాయి.

మహోన్నతమైన మార్క్సిజం – లెనినిజం సిద్ధాంతంవల్లనూ, దానిని సాధించడానికై జరిపే సంయుక్త పోరాటంవల్లనూ ప్రపంచమందలి కమ్యూనిస్టులందరూ ఐక్యంచేయబడి వున్నారు. సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగానూ, శాంతి, ప్రజాతంత్రం, సోషలిజముల కొరకూ జరిగే పోరాటంలో నిర్వహించవలసిన ఉమ్మడి కర్తవ్యాల గూర్చి యీ సమావేశంలో సౌహార్ద పార్టీలన్నీ ఉమ్మడిగా నిర్ణయించిన అంచనాలనూ, నిర్ణయాలనూ పాటించడంలో ప్రతి ఒక్క కమ్యూనిస్టుపార్టీ ఏకత్వమును ప్రదర్శించడం, కమ్యూనిస్టు వుద్యమ ప్రయోజనాలకు అవసరం.

ప్రతి కమ్యూనిస్టుపార్టీ, అన్ని దేశాల కమ్యూనిస్టు మహాసైన్యం తన సంకల్పంలోనూ, కార్యాచరణలోనూ మరింత ఘనిష్టఐక్యతను సాధించటమనేది కార్మికవర్గ ఆశయంకొరకై జరిగే పోరాటంయొక్క ప్రయోజనాలకు అవసరం. ప్రపంచ కమ్యూనిస్టువుద్యమంలో మరింత హెచ్చైన ఐక్యతకొరకై సదా కృషిచేయడం ప్రతిఒక్క మార్క్సిస్టు–లెనినిస్టు పార్టీయొక్క అత్యున్నత అంతర్జాతీయ కర్తవ్యం.

జాతీయ స్వాతంత్ర్యం, ప్రజాతంత్రం, శాంతికొరకై జరిగే పోరాటంలో విజయం సాధించాలంటేనూ, సోషలిస్టు విప్లవకర్తవ్యాలను జయప్రదంగా పూర్తి చేయాలంటేనూ, సోషలిజాన్నీ కమ్యూనిజాన్నీకూడ జయప్రదంగా నిర్మించే కర్తవ్యాన్ని పూర్తి చేయాలంటేనూ, మార్క్సిజం – లెనినిజము, శ్రామికవర్గ అంతర్జాతీయత సిద్ధాంతాల ప్రాతిపదికపై ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమ ఐక్యతను పట్టుదలతో సంరక్షించటమూ, ఆ ఐక్యతను బలహీనపర్చే ఏలాంటిచర్యా జరగకుండా నిరోధించటమూ అవసరమైన షరతులు. ఈ సూత్రాలను ఉల్లంఘించటం జరిగితే కమ్యూనిస్టు శక్తులకు అంతరాయం కల్గుతుంది.

మార్క్సిస్టు – లెనినిస్టు పార్టీలు అన్నీ స్వతంత్రమైనవి; సమాన హక్కులుగలవి. అవి తమ తమ దేశాలలోవుండే ప్రత్యేక పరిస్థితులకు అనుగుణ్యంగానూ, మార్క్సిస్టు – లెనినిస్టు సూత్రాలకు కట్టుబడి వుంటూనూ తమ పాలసీలను రూపొందించుకొంటాయి; పరస్పరం సహకరించుకొంటాయి. మొత్తం మార్క్సిస్టు – లెనినిస్టు పార్టీలమధ్య అంతర్జాతీయ దృఢమైత్రి లేకుండా ఏ దేశములోనైనా కార్మికవర్గ ఆశయం విజయం పొందుతుందనుకోవడం ఊహకందని విషయం. ప్రతి పార్టీ తన దేశంలోని కార్మికవర్గానికీ, శ్రామిక ప్రజానీకానికీ, అంతర్జాతీయ కార్మికవర్గానికీ, మొత్తం కమ్యూనిస్టు వుద్యమానికీ జవాబుదారీ వహించుతోంది.

అత్యవసర సమస్యలగూర్చి చర్చించుకొంటానికీ, అనుభవాలను పరస్పరం తెలియజేసుకొనటానికీ, పరస్పర అభిప్రాయాలను తెలియ జేసుకొంటానికీ, సంప్రదింపుల ద్వారా ఉమ్మడి

అభిప్రాయాలను ఏర్పర్చుకోవటానికీ, ఉమ్మడి లక్ష్యాలను చేరటానికిగాను సంయుక్త చర్యలను సమన్వయింప చేసుకుంటానికీ అవసరమైనప్పుడల్లా కమ్యూనిస్టు కార్మికపార్టీలు సమావేశాలను జరుపుతూ వుంటాయి.

మరొక సోదరపార్టీయొక్క కార్యకలాపాలకు సంబంధించిన ఏ సమస్యలనైనా స్పష్టంచేసుకోవాలని ఏ పార్టీయైనా అనుకుంటే, అందుకుగాను ఆ పార్టీ నాయకత్వం ఆ సమస్యకు సంబంధించిన సోదర పార్టీనాయకత్వమును కలుసుకొంటుంది. అవసరమైతే వారు సమావేశాలనూ, సంప్రదింపులనూ సాగిస్తారు.

ఇటీవలి కాలంలో కమ్యూనిస్టుపార్టీల ప్రతినిధులు జరిపిన సమావేశాల అనుభవమూ, ఫలితాలూ మరీ ముఖ్యంగా 1957 నవంబరులో జరిగిన సమావేశం, ఇప్పుడు జరిగిన సమావేశం, ఈ రెండు సమావేశముల అనుభవాలూ, ఫలితాలూ తెలియజేసే దేమిటంటే ప్రస్తుత పరిస్థితులలో ఇటువంటి సమావేశాలు అనుభవాలనూ, అభిప్రాయాలనూ పరస్పరం తెలియజేసుకొంటానికి చక్కటిమార్గాలు. సమిష్టి కృషిద్వారా మార్క్సిస్టు — లెనినిస్టు సిద్ధాంతాన్ని పరిపుష్టం చేస్తానికి తోడ్పడే పద్ధతి; ఉమ్మడి లక్ష్యాలను చేరుకొంటానికై జరిపే పోరాటంలో ఉమ్మడివైఖరిని విశదపర్చే మార్గం.

అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమంలో కెల్లా మిక్కిలి అనుభవాన్ని సంపాదించి, మిక్కిలి రాటుదేలిన పార్టీ కాబట్టి సోవియట్ యూనియను కమ్యూనిస్టుపార్టీ, ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమంయొక్క సర్వజనాంగీకృత నాయకుడుగా వున్నదనీ, ఇక ముందుకూడా వుంటుందనీ కమ్యూనిస్టు, కార్మికపార్టీలన్నీ ఏకగ్రీవంగా ప్రకటిస్తున్నవి. కార్మికవర్గ విజయంకొరకు జరిపిన పోరాటంలోనూ, సోషలిస్టు నిర్మాణంలోనూ, పెద్దఎత్తున కమ్యూనిజాన్ని నిర్మించడంలోనూ సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ సంపాదించిన అనుభవం మొత్తం ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమానికే అత్యంత ప్రాముఖ్యతగల అనుభవం. సోవియట్ పార్టీ ఉదాహరణ, దాని సౌహార్ద్రమైత్రి అన్ని కమ్యూనిస్టుపార్టీలనూ, అవి శాంతి, సోషలిజ

ములకొరకై జరిపే పోరాటంలో ఉత్తేజపరుస్తున్నవి; శ్రామికవర్గ అంతర్జాతీయ విప్లవ సిద్ధాంతాలను ఆచరణలో పెట్టడాన్ని చూపెట్టుచున్న సోవియటుపార్టీ 20 వ కాంగ్రెసు చారిత్రాత్మక నిర్ణయాలు సోవియటుపార్టీకి, సోవియటు యూనియన్‌లో జరిగే కమ్యూనిస్టు నిర్మాణానికి మాత్రమే అత్యంత ప్రాముఖ్యతను కలిగివున్నవిగాక అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమంలో ఒక నూతనదశను ప్రారంభించినవి. మార్క్సిజం — లెనినిజము ప్రాతిపదికపై ఈ నూతనదశ అభివృద్ధికి ప్రోద్బలమిచ్చినవి.

మహత్తరమైన మార్క్సిజం—లెనినిజంయొక్క సిద్ధాంతాన్ని అభివృద్ధిచేస్తానికి అన్ని కమ్యూనిస్టు, కార్మికపార్టీలూ తోడ్పడుచున్నవి. మార్క్సిస్టు — లెనినిస్టు సౌహార్ద పార్టీలమధ్య పరస్పరసహాయము; ప్రాపు అనే సంబంధాలు ఏర్పడడంద్వారా శ్రామికవర్గ అంతర్జాతీయతయొక్క విప్లవసిద్ధాంతాలు ఆచరణలోకి రావటానికి రూపం యివ్వబడినది.

ఈనాడు తాత్విక సమస్యలకు మరింత ప్రాధాన్యత ఏర్పడినది. బూర్జువాతత్వసిద్ధాంతాలకు ప్రజలను ఆధ్యాత్మికంగా బానిసలుగా కట్టిపెట్టుచున్నాస్తూ దోపిడివర్గాలు ఆ ప్రజలపై బలీయమైన సిద్ధాంతరూపక ఒత్తిడులను అంతకంతకూ ఎక్కువజేస్తారు. తద్వారా సోషలిస్టువిజయాల ఫలితాలను వమ్ముజేయటానికి ప్రయత్నిస్తారు. తాత్విక రంగంలో ఖచ్చితమైన పోరాటాన్ని సాగించటమూ, సంస్కరణవాద విష ప్రభావంతోసహా అన్నిరకాల, అన్నిరూపాల బూర్జువా తత్వ సిద్ధాంతాల బంధనాలనుండి ప్రజలను విముక్తిజేయటానికి కృషి చేయటమూ, సామాజికాభివృద్ధికి వుపయోగపడే అభ్యుదయ భావాలనూ, ప్రజాతంత్రము, స్వాతంత్ర్యముల అభ్యుదయ భావాలనూ, శాస్త్రీయ సోషలిజం, తాత్విక ఆలోచననూ ప్రజలలో ప్రచారంచేయటమూ, తమ విధ్యుక్తధర్మంగా కమ్యూనిస్టులు ఎంచుతారు.

సోషలిస్టు వ్యవస్థ ఏర్పడినతర్వాత కూడా చాలాకాలంవరకూ ప్రజల మనస్సులలో పెట్టుబడిదారీ విధానపు అవశేషాలు కొనసాగుతూవుంటాయని చారిత్రకానుభవం మనకు తెలియజేస్తున్నది.

కాబట్టి పార్టీ ప్రజలలో కమ్యూనిస్టు బోధనచేసే విస్తార కార్య క్రమాన్ని తీసుకోవలసివుంటుందనీ, పార్టీ కార్యకర్తలకూ, ప్రభుత్వ కార్యకర్తలకూ మరింత హెచ్చుగా మార్క్సిస్టు – లెనినిస్టు తర్ఫీదును యివ్వవలసివుంటుందనీ తెలుస్తున్నది.

మొత్తం ప్రపంచమందలి కార్మికవర్గమూ, శ్రామిక ప్రజలూ శాంతి, స్వేచ్ఛా, సుఖజీవితములకొరకూ, మిక్కిలి న్యాయసంగతమైన సమాజాన్ని, కమ్యూనిజాన్ని – ఏర్పర్చటానికి జరిపే గొప్ప పోరాటాలలో మార్క్సిజం – లెనినిజము మార్గదర్శకముగా వుంటుంది. అది గొప్పదైన, పూర్ణమైన విప్లవ సిద్ధాంతం. జీవితంలో అభేద్యమైన బంధమును కలిగివుండడంలోనూ, వాస్తవ పరిస్థితులను క్షుణ్ణంగా అనుశీలనం చేయటంద్వారాగాని, సదాసంపన్న వైజ్ఞానిక్యతంలోనూ దాని సృజనాత్మకమైన, బ్రహ్మాండమైన విప్లవపూరితశక్తి యిమిడి వున్నది. మార్క్సిజం – లెనినిజం ప్రాతిపదికపై సమైక్య సోషలిస్టు దేశాలూ, అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమమూ, అంతర్జాతీయ కార్మికోద్యమమూ, విముక్తి వుద్యమమూ చారిత్రాత్మక విజయాలను సాధించినవి. ఈ ప్రాతిపదికపై మాత్రమే తమ్ము యెదుర్కొనే అన్ని కర్తవ్యాలనూ కమ్యూనిస్టు, కార్మికపార్టీలు సమర్థతతో పూర్తిచేయ గలవు.

**మార్క్సిజం – లెనినిజము ప్రాతిపదికపై కమ్యూనిస్టుపార్టీలూ, శ్రామికవర్గ అంతర్జాతీయతా మరింత దృఢపడటాన్ని ఈ సమావేశం గమనిస్తున్నది. కార్మికవర్గ ఐక్యతకు ప్రజాతంత్ర, పురోగామిశక్తుల ఐక్యతకు కమ్యూనిస్టుపార్టీల ఈ బలమే ప్రాథమిక కారణంగా వుంటుంది; మొత్తం మానవజాతికి సుఖప్రదమైన భవిష్యత్తును సాధిస్తానికీ, శాంతి సోషలిస్టు ఉద్యమాలు జయప్రదం కావటానికీగాను ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమమూ, ప్రపంచ కార్మికోద్యమమూ సాగించే బ్రహ్మాండమైన పోరాటాలలో నూతన విజయాలను సాధిస్తానికికూడా కమ్యూనిస్టుపార్టీల యీ బలమే గ్యారంటీగా పనిజేస్తుంది.**

[సమాప్తం]